అఖిల భారత రైతు సంఘం

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 | బుధవారం 19-4-39 బెజవాడ | సంచిక 18

## స్వామి సహజానంద



గత సంవత్సరము అఖిల భారత రైతు సంఘాధ్యక్షుడుగా ఉండి రైతు ఉద్యమాన్ని జయప్రదంగా నడిపారు. ఈ సంవత్సరము ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడిరి.

# నవశక్తి

## పార్టీ సభ్యులు ముఖ్యంగా గమనించాలి

| | ఏప్రిల్ నెల కోటా | మొదటి వారములో చేర్పించినది. |
|---|---|---|
| విశాఖపట్టణం | 10 | 0 |
| తూ. గోదావరి | 30 | 2 |
| ప. గోదావరి | 30 | 3 |
| కృష్ణా జిల్లా | 50 | 4 |
| గుంటూరు | 30 | 7 |
| నెల్లూరు | 25 | 3 |
| రాయలసీమ | 10 | 4 |
| చిత్తూరు | 5 | 2 |
| కర్నూలు | 5 | 0 |
| ఇతర స్థలాలు | 15 | 3 |
| | 200 | 28 |

* * *

## ఏజెంట్లు గమనించాలి

1. అమ్మిన ప్రతి కాపీకి 25% కమిషను ఇవ్వబడును.
2. ఏజెంట్లుకు పంపిన కాపీలలో 10% (నూటికి పది) కన్న ఎక్కువ కాపీలు తిరిగ తీసుకోబడవు.
3. ప్రతి నెల బిల్లులు, మరుసటి నెల 15 వ తారీఖు లోపల చెల్లించవలయును.
   ఉదా :—మార్చి నెల బిల్లు ఏప్రిల్ 15 వ తారీఖులోపల చెల్లించవలయును.
4. అట్లు చెల్లించని వారికి పత్రిక ఆ పైన పంపబడదు.
5. ఏ ఏజెంటుకైనను 10 కాపీలకు తక్కువ పంపించబడవు.

—మేనేజరు.

* * *

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్థ సంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

బర్మా రేట్లు

| | |
|---|---|
| సంవత్సర చందా | రు 5—0—0 |
| విడి ప్రతి | 0—1—6 |

* * *

## ప్రకటన రేట్లు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | | |
|---|---|---|
| 20 అం॥ లోపల ప్రతి అంగుళానికి | రూ. | 0—6—0 |
| 20" అం॥ పైన | ,, | 0—4—0 |
| 100" అం॥ పైన | ,, | 0—3—0 |
| పేజీ | రు 10—0—0 లు | |
| ½ పేజీ | 6—0—0 లు | |
| ¼ పేజీ | 3—0—0 లు | |

షరా:—ఈ రేట్లుపైన కమిషన్‌లు. డిస్కౌంటులు ఇవ్వబడవు. రు 0—8—0 లకు తక్కువ ప్రకటనలు తీసుకొనబడవు. నెలకగు డబ్బు ముందుగా ఇవ్వవలెను.

ప్రత్యేక చోటునకు, ప్రత్యేక రేట్లు.



## రేపల్లె తాలూకా కాంగ్రెస్ సోషలిస్టు సభ్యుల సమావేశము

9—4—39 వ తేదీన రేపల్లె తాలూకా కాం॥సో॥ పార్టీ ఆఫీసులో కామ్రేడ్ కె. సత్యనారాయణగారి అధ్యక్షతను సమావేశమై ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడినవి.

(1) కార్యదర్శిగారి గత సాంవత్సరిక నివేదిక అంగీకరించడమైనది.

(2) క్రొత్త సంవత్సరమునకు సెక్రటరీగా కామ్రేడ్ చదలవాడ పిచ్చయ్యగారిని ఏకగ్రీవముగా ఆమోదించడమైనది. సహాయకార్యదర్శిగా కామ్రేడ్ కూచిభొట్ల రామశాస్త్రిగారినికూడ ఏకగ్రీవంగా ఎన్నుకోవడమైనది.

(3) మేనెలలో తెనాలి, రేపల్లెతాలూకాల (ఫిర్కా) వేసంగి పాఠశాలను పల్లెకోనలో జరుపుటకు నిర్ణయించడమైనది.

(4) త్రిపురి కాంగ్రెసులో ప్యాసు అయిన "నేషనల్ డిమాండు" తీర్మానమును తాలూకాలో ప్రచారము చేసి ఫెడరేషను ప్రతికూల పోరాటమును బలపరచుటకు రెండు దళములుగా నియమించి, (1) కామ్రేడ్ కె. సత్యనారాయణ (2) కామ్రేడ్ కె. వెంకటరత్నంగార్లను దళాధిపతులుగా నియమించడమైనది.

(5) కాకినాడ పీచు, ఉప్పుమాల్ కూలీలు వారి న్యాయమైన కోర్కెలను యీడేర్చుకొనుటకు సమ్మె చేయుచున్న సందర్భంలో జరిపిన లాఠీచార్జి అరెస్టులు మొదలయినవి కాంగ్రెసు ప్రభుత్వహయంలోనే జరుగుట కాంగ్రెసు సంస్థకు తీరని బలహీనాన్ని గలుగచేస్తుందని భావిస్తూ కార్మికులను అక్రమముగా లాఠీదెబ్బలను గురిచేసిన ప్రభుత్వోద్యోగులకు తగు శిక్ష విధించవలసినదిగానూ, అరెస్టు చేయబడిన కార్మికులనూ, నాయకులనూ ఎట్టి షరతులులేకుండా విడుదల చేయవలసినదిగానూ మద్రాసు కాంగ్రెసు మంత్రివర్గమువారిని కోరడమైనది.

ii. కాకినాడ కార్మికులు చేయుచున్న పోరాటము న్యాయమైనదని తమ కోరికలీడేరువరకు సమ్మె సాగింపవలసినదనియూ, దేశములోని ప్రజా సంస్థలన్నియూ సమ్మెచేయు కార్మికులకు ఆర్థిక సహాయము చేయవలసినదిగా యీ సభవారు కోరుచున్నారు.

(6) తెనాలి లక్ష్మీ ప్రెస్ కార్మికులు వారి న్యాయమైన హక్కులు కాపాడుకొనుటకు చేయు పోరాటాన్ని అభినందించుచూ జయము పొందుపరకూ పోరాటాన్ని సాగించవలసినదనియూ యీ సభవారు కోరుచున్నారు.

ఇట్లు,
చదలవాడ పిచ్చయ్య,
కార్యదర్శి,
తాలూకా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ.

సంపుటం 2

# నవశక్తి

బుధవారం

సంచిక 18

19-4-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు). కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య. తుమ్మల వెంకట రామయ్య.

## గయా కిసాన్ మహాసభ

10 వ తేదీ గయాలో ఆచార్య నరేంద్రదేవ్ అధ్యక్షతను జరిగిన అఖిలభారత కిసాన్ మహాసభ భారత జాతీయ ఆశయమును గూర్చి ఆదర్శప్రాయమైన తీర్మానం గావించింది. ఈ మహాసభలో అన్నిటికంటే మెచ్చుకోదగినది కమ్యూనిస్టులు, సోషలిస్టులు, కిసాన్ సేవకులు అందరూ కలిసి ఏకముఖముగా రైతు ఉద్యమాన్ని, తద్వారా జాతీయ పోరాటాన్ని సంయుక్త నాయకత్వము క్రింద నడుపుటకు చేసిన ప్రియత్నాలు జయప్రద మగుటయే. ఈ సంయుక్త సమాలోచనా ఫలితముగానే ప్రిస్తుత పరిస్థితులన్నీ సమగ్రముగా పరిశీలించి స్వాతంత్ర్యపోరాటానికి అవసరమైన కార్యక్రమాన్ని యివ్వగలిగింది.

తీర్మానము గడచిన సంవత్సరము రైతులు వర్గ చైతన్యము పొంది జమీందార్ల సామ్రాజ్యవాదుల దోపిడీవిధానాన్ని ఎదిరించుతున్నారని విశదపరచింది. రైతులు తమ్ము సామ్రాజ్యవాదము అనేక ప్రత్యక్ష పరోక్ష మార్గాలద్వారా దోచుకుంటూందని, జమీందారీ విధానము సామ్రాజ్యవాద సహాయమువలనే మనగల్గుతూందని తెలిసికొన్నారు. అందుచే రైతుల రోజు రోజు పోరాటాలు ఆఖరుకు సామ్రాజ్యవాదాన్ని నాశనము గావించే వ్యవసాయకవిప్లవంద్వారా భూమిపై పెత్తనము తమకు వస్తుందనీ, ప్రిభుత్వానికి తమకు మధ్య దళారీలు తొలగింపబడి తమ శ్రమఫలితాన్ని తామే అనువించే స్థితి వస్తుందని రైతులు తెలసికొన్నారు. గడచిన యేడాది రాష్ట్రి ప్రభుత్వాలు రైతుల కొనర్చిన స్వల్ప సౌకర్యాలు రైతులను సంతృప్తిపరచక రాష్ట్రిస్వపరిపాలనలోని బూటకత్వాన్ని బయల్పరచింది. అందుచే రైతులు నూతన రాజ్యాంగవిధానాన్ని భగ్నము గావించడానికి సన్నిద్ధమవుతున్నారు. కిసాన్ మహాసభ కాంగ్రెసు మహాసభతోను, కార్మిక మహాసభతోను కలిసి బ్రిటిషు సామ్రాజ్యానికి వ్యతిరేకముగా సంయుక్తప్రతిఘటన గావించాలని స్పష్టపరచింది. భారత ప్రజలలో మూడవ వంతువున్న స్వదేశ సంస్థాన ప్రజలు పౌరసత్వ హక్కుల కొరకు పోరాటము సాగించుచున్నారు. మధ్యయుగపు నాటి యీ నరేంద్రులకు వ్యతిరేకముగా సాగించబడుతున్న ఈ పోరాటము ప్రధానముగా రైతుల అర్థిక హక్కులకు సంబంధించిన పోరాటమే.

దేశమందలి ప్రజా సామాన్యములో కార్మిక, కర్షకుల్లో, యువకులలో విద్యార్థుల· స్త్రీలలో స్వాతంత్ర్య ప్రజాస్వామిక స్వరాజ్యముకోసము పోరాడటానికి పిపాస హెచ్చింది. వీనితోపాటే బ్రిటిషు ప్రభుత్వము రానున్న అంతర్జాతీయ క్లిష్టపరిస్థితుల్లో సామ్రాజ్యాన్ని కాపాడుకోడానికి యుద్ధసన్నాహాలు గావించుతూంది. రాష్ట్రి ప్రభుత్వాధికారాలను సంకుచితపరచడానికి సవరణలు తెస్తూంది. ఈ పరిస్థితులలో బ్రిటిషు సామ్రాజ్యాన్ని కాంగ్రెసు మహాసభ, కిసాన్‌సభ, కార్మికమహాసభ, సంస్థాన ప్రజల సంయుక్త ప్రతిఘటన ద్వారా ఎదిరించి సంపూర్ణ స్వరాజ్యమును తద్వారా కార్మిక—కర్షక రాజ్యాన్ని స్థాపించుటకు ఈ క్రింద కార్యవిధానము మహాసభ సూచించింది.

1. రానున్న జాతీయపోరాటముయొక్క ఆవశ్యకతను గురించి ప్రజలలో ప్రిచారము గావించుట

2. స్థానిక కర్షక పోరాటాలను తీవ్రముగా సాగించుట

3. అఖిలభారత కిసానుమహాసభ, అఖిలభారత ట్రేడ్ యూనియన్‌కాంగ్రెస్, కాంగ్రెసు మహాసభ తదితర సామ్రాజ్య వ్యతిరేక సంస్థలతో కూడి సంయుక్త ప్రతిఘటన ఏర్పరచుట

.4 రాష్ట్రిప్రభుత్వాలచే కిసాన్‌సభ కోర్కెలను, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలను ఆచరణలో పెట్టించుట.

5. ప్రజల, ఆర్థిక రాజకీయ హక్కుల కొరకై పోరాటం సాగించుట ద్వారాను, అల్పసంఖ్యాకుల హక్కుల రక్షించుట ద్వారాను, మత సాంఘిక కలహాలను లేకుండా చేయుట.

6. బలమైన రైతు వాలంటీరు దళాన్ని ఏర్పరచుట.

7. సంస్థాన ప్రజాపోరాటాలకు ప్రత్యక్ష సహకార సహాయాలు గావించుట.

కిసాన్ మహాసభ ప్రతినిధులందరిని యీ తీర్మానాన్ని ప్రజలలో ప్రచారం గావించాలని కోరింది. ఈ తీర్మానం రైతులకేగాక భారతీయు లందరికి జాతీయ పోరాటం జరుప వలసిన విధానాన్ని సూచించింది. జరుగనున్న అఖిలభారత కాంగ్రెసు కమిటీ కలకత్తా సమావేశం యీ విధానాన్ని అనుసరించి భారత జాతీయ పోరాటాన్ని సాగించుటకు పూనుకోవాలని ఆశించుతాము.

గయా కిసాన్ మహాసభ రాజకీయ విధానం, పాలసీ నిర్ణయించడం యింత ముందంజ వేసినా, రైతు సంఘాల, పోరాటాల నిర్మాణ సమస్యలను గురించి సంపూర్ణంగా చర్చించి కార్య విధానం సూచించక లేకపోయింది. వివిధ రాష్ట్రాలలో వచ్చిన రైతు పోరాటాలను గురించి చర్చించలేదు. అందుచే స్థానికరైతు పోరాటాలను ఎటుల నడపాలో జనరల్ సూచనలైనా గావించ లేక పోయింది. మునగాల, కాళీపట్నం వగైరా లాంటి స్థానిక రైతు పోరాటాలలో అనుభవికముగా వచ్చుచున్న చిక్కులను గురించి చర్చించి అవలంబించ వలసిన పద్ధతులను రైతు సేవకులకు కిసాన్ మహాసభ తెలియ చేయవలసిన అవసర మెంతేని గలదు.

ముందు సంవత్సరము కిసాన్ మహాసభను ఆంధ్రదేశములో జరుపుటకు నిర్ణయింప బడింది. ఆంధ్ర ప్రతినిధులు మహాసభను ఆహ్వానించడంలో గొప్ప బాధ్యతను తమపై నిడుకొన్నారు. మహాసభాస్థల నిర్ణయం. డబ్బుకూర్పు ప్రయత్నాలు వెంటనే ప్రారంభింప బడాలి. ఆంధ్రరాష్ట్రి రైతుసంఘము యిప్పటి నుండీ ప్ర చా ర ము ప్రారంభించాలి. ఆంధ్రదేశమందలి ప్రతిజిల్లాలోను ఆయా జిల్లా రైతుసంఘాలు యిప్పటినుండీ అఖిలభారత కిసాన్ మహాసభ ఆంధ్రదేశంలో జరుగుతుందని పల్లె పల్లెకు తెలియునట్లు యేర్పాట్లు గావించాలి. మహాసభ ఆంధ్రదేశములో ఇదివరకు కనివిని యెరుగ నంత ప్రజానీకాన్ని ఆకర్షించునట్లుగా వుండాలి. ఆంధ్రరాష్ట్రి రైతుసంఘం గావించు ఏర్పాట్లకు ఆంధ్ర దేశమంతా సహాయము గావించడానికి పూనుకొంటుందని అశించుతాము.

## కర్తవ్యం?

అఖిలభారత కాంగ్రెసు కమిటీ 28 వ తేదీన సమావేశమవుతూ వుంది. ఒక వైపు ప్రపంచయుద్ధము రేపోమాపో అన్నట్లు ఉంది. యుద్ధానికి తయారీలు ప్రపంచమందంతా జరుగుతున్నాయి. బ్రిటిషు ప్రభుత్వము కూడ యుద్ధాన్ని జయప్రదముగా సాగించడానికి మనదేశములో బానిస ఫెడరలు రాజ్యాంగవిధానాన్ని అమలులో పెట్టడానికి పూనుకుంటూ ఉంది. స్వదేశ సంస్థానాధీశులతో 'మీరు మాటాడక ఫెడరేషనులో చేరక తప్పదని' హుకుములు జారీ చేసింది. రాజ్యాంగ ప్రణాళికలో ఉన్న హక్కులను కూడ సంకుచిత మొనర్చుచున్నది. జహ్వార్‌లాల్ పోరాటము తప్పదు, ముందుకు దూకండి అని శంఖారావము చేస్తున్నాడు. ఇట్టి సమయములో పోరాటాన్ని సంయుక్తకాంగ్రెసు నడుపునని ఆశించాము. దానికి కావలసిన కార్యక్రమము రాబోవు అఖిలభారత కాంగ్రెసు సంఘము నిర్ణయించునని దేశమంతా ఎదురుచూస్తూ ఉంది.

కొన్ని నేటివార్తలు ఈ ఆశలన్నింటిని అడుగంటించాయి. సుభాషుబాబు మీద విశ్వాసరాహిత్వాన్ని ఉపపాదిస్తూ 6 గురు ఎ. ఐ. సి. సి. సభ్యులు నోటీసిచ్చారు. వర్కింగు కమిటీని తానేర్పరచ జాలక పోయాను. భవిష్యత్కర్తవ్యము మీరే ఆలోచించండి అని బోసు ఎ. ఐ. సి. సి. ని కోరుతాడని ఒకవార్త. రాజీనామా ఇస్తాడని మరియొకవార్త. అంతే దేశమంతా ఎదురుచూస్తూ ఉన్న ఐక్యత, గాంధిజీ బోసుల ఐక్యత కుదరలేదు, దీనికి కారణాలేమైనా, బాధ్యత ఎవరిదైనా ప్రతి స్వాతంత్ర్యాభిలాషి విచారించకమానడు.

గాంధీజీ గ్రూపు తనకు సహకారము చేయలేనపుడు కాంగ్రెసులో గాంధీజీ అనుచరు లధిక సంఖ్యాకులుగా ఉండినపుడు, కాంగ్రెసు కార్యక్రమము సున్నితముగా జరుగడానికి తాను రాజీ ఇవ్వడమే మార్గమని సుభాసుబోసు తలచియుండిన సబబే కాని ఇప్పటికీ మించినది లేదు, ఎ. ఐ. సి. సి. సభ్యులందరు బోరావు పోరాటాన్ని మనస్సునం దిడుకొని ఐక్యత కొరకు. ఇక్యనాయకత్వము కొరకు ప్రయత్నించాలని మేము కోరుచున్నాము.

# సంపాదకీయాలు

**ఇండో బ్రిటిషు ఒడంబడిక**

ఇండియా చట్టములో మార్పులు తీసుకవచ్చారు. ఇవి ప్రస్తుతము ఉన్న అధికారాలను కూడ, తీసే సేవిగా ఉన్నాయి. యుద్ధభయము మూలంగా రాజ్యాంగ చట్టములో తమకు గావలసిన అధికారాలను ఏర్పరచు కోవడమేగాక, యుద్ధ క్షోభమూలంగా వచ్చేనష్టాన్ని కూడ భారతీయుల నెత్తిమీదనే రుద్దడానికి ఇండో బ్రిటిషు ఒడంబడికను గావించింది.

భారతీయ వర్తకమండలి సమావేశమై ఈఒప్పేదు పాస్టను ఖండించింది. దీనిని భారతీయ అస్సెంబ్లీ ప్రతినిధులు వలదని చెప్పుచున్నను ఆచరణలో పెట్టినచో బ్రిటనుకు, ఇంగ్లండుకు సంబంధాలు పూర్తిగా చెడిపోతాయని తీర్మానించింది.

పురుషోత్తమదాస్ ఠాకుర్‌దాస్, ఈ ఒడంబడిక చేసుకోడానికి వెళ్ళిన అనధికార సభ్యుల సూచనలను మొత్తానికి ప్రభుత్వము అంగీకరించినా, కడకు లాంకషైరుకు అనుకూలంగా ఉండేటట్లు నిర్ణయించిందన్నాడు. ముఖ్యముగా విదేశాల నుండి భారతీయఫ్యాక్టరీ లుపయోగించు సన్ననూలు ప్రత్తిపై దిగుమతి సుంకాలు రెండింతలు చేయడము వలన లాంకషైరుకు నూటికి 4 చొప్పున రక్షణ యిచ్చింది. దీనితో లాంకషైరు వర్తకులు కోరినదంతా వారికి పచ్చేసింది. భారతీయ పరిశ్రమలకు పూర్తిగా నష్టము కల్గుచుందని వివరించాడు.

వర్తకమండలి యొక్క తీర్మానాన్ని ప్రభుత్వము లక్ష్యము చేయలేదు. ఒడంబడికను అమలులో పెట్టడానికి కావలసిన సవరణలతో ఒక టారిపుబిల్లును (సుంకములువేయు చట్టాన్ని) ఢిల్లీ అస్సెంబ్లీలో తెచ్చింది. అస్సెంబ్లీ దానిని త్రోసివేసింది. కాని వైస్రాయి సర్టిఫైచేస్తూ బిల్లును చట్టాన్ని చేయివలసినదని తిరిగి పంపించాడు. అస్సెంబ్లీ మరల నిరాకరించింది.

ఆ సమయములో బుల్లుభాయి ప్రభుత్వానికి ఒక హెచ్చరిక చేశాడు: "ఇలా చేయడంలో ప్రభుత్వము ఒక అపాయకరమగు మార్గాన పోతూఉంది. ఇది ఆత్మహత్య చేసుకొను పద్ధతియే. ప్రభుత్వాని కిష్టమువచ్చిన చక్కని అవకాశాలు చట్టముద్వారా కల్పించుకొని సామగ్రిని ఈదేశములోకి తీసుక రావచ్చు. కాని దానిని అమ్మడము మాత్రము సాధ్యముకాని పని. ప్రజాభిప్రాయములో, ప్రజాశక్తిలో ఎంతమార్పు వచ్చిందీ ప్రభుత్వము గుర్తించాలి. ఈదేశములో ఆసామగ్రి అమ్ముడుపోక ఇతర దేశాలకు తిరిగి ఎగుమతి చేసుకోవలసి వస్తుంది. ఇది బెదరింపుకాదు. ఇది తప్పక జరిగి తీరుతుంది జాగ్రత్త" అన్నాడు. కాని ప్రభుత్వము ఏమీ వినిపించుకోలేదు.

**వర్తకుల అసంతృప్తి**

భారతీయ వర్తక చక్రవర్తులను కూడ తృప్తిపరచలేకపోతూ ఉంది బ్రిటిషు ప్రభుత్వము. వర్తకులకు కర్షకులు కాని వారినుండి రావలసిన అప్పులను తగ్గించకూడదని; వ్యవసాయదారులకు కూడ వ్యవసాయానికి కన్న ఎక్కువ ఆదాయము ఇతర విధాల వస్తూ ఉండే వారికి అప్పులు తగ్గించకూడదని మరియొక తీర్మానాన్నికూడ భారతీయ వర్తక ఫెడరేషను చేసింది. కాంగ్రెసు మంత్రులు చేసే చట్టాలు, రైతులకు, కూలీలకు వారికి కావలసినన్ని హక్కులను ఇవ్వడము లేదని దేశమంతా విమర్శిస్తూ ఉంటే, ఇప్పుడు చేసేవి చాలా తీవ్రంగా ఉంటూ ఉన్నాయని ఈ వర్తకమండలి ఆక్షేపిస్తూ ఉంది. ఇట్టి మితవాద వర్తక మండలికూడ బ్రిటిషు ప్రభుత్వపు ఆర్థిక నీతి తనకు హానికరమని వ్యతిరేకిస్తూఉంది.

ఇద్ కేవలము ఇండో బ్రిటిషు వర్తకపు దొడంబడికలోనేకాదు, ఇంకను ఇతరవిషయాలలోకూడ తమకు బ్రిటిషు ప్రభుత్వము నష్టము కలిగిస్తూ ఉందని తీర్మానించింది. రెండు ఉదాహరణలు.

భారతీయ పరిశ్రమలకు రక్షణ ఇచ్చుటకు దిగుమతిపన్నులు వేశారు. కాని ఈ పన్నులను తప్పించుకోడానికి విదేశస్థులు భారతదేశములోనే పరిశ్రమలను స్థాపిస్తూ ఉన్నారు ఆవిధంగా ఇప్పటికే స్థాపించిన వానిసంఖ్య 180 వరకు ఉంటుంది. అందుచే రూపాయలలో తమ పెట్టుబడికి వాటాలు యివ్వని కంపెనీలకు, భారత దేశస్థులకు మూడింట రెండువంతులు వాటాలు యివ్వని కంపెనీలకు కనీసము తనిఖీచేయడములోను, మేనేజ్‌మెంటులోను భారతీయులకు మూడింట రెండువంతులు ఇవ్వని కంపెనీలకు ప్రధాన పరిశ్రమలలోను, పెట్టుబడి, మేనేజ్‌మెంటు పూర్తిగా భారతీయులకు ఉండనిచో అట్టి కంపెనీలకు భారత దేశములో రిజిష్టరు చేయబడడానికి (ఆరంభించడానికి) అనుమతి నివ్వకూడదని వర్తక మండలి తీర్మానించింది.

(2) రెండవ విషయము. కోస్తావ్యాపారము మన నౌకలకే ఉండాలని, విదేశ నౌకా కంపెనీలు భారతీయ నౌకా పరిశ్రమను భగ్నము చేయుటకు తమ రేట్లు విపరీతముగా తగ్గించి పోటీ చేస్తున్ననూ, దాని విషయమై ఇండియా ప్రభుత్వము ఎట్టి జోక్యము కలిగించుకొనకుండుటను తీవ్రంగా వర్తక మండలి విమర్శించింది. అంతేగాక విదేశాలకు వెళ్లే సరకు, ప్రయాణికులు కొంతవరకు భారతీయనౌకలలో వెళ్లేటట్లు ప్రభుత్వము సహాయము చేయవలసినదిగా కూడ తీర్మానించింది.

ఒకవైపు బ్రిటిషుప్రభుత్వము ఆర్థికంగా భారతీయులను మరింత పరాధీనంగా చేయ ప్రయత్నిస్తూ ఉన్నప్పుడే అభివృద్ధి చెందుతూ ఉన్న భారతీయ పరిశ్రమాధి కారులు మునుపటి కన్న ఎక్కువ సౌకర్యాలు కావాలనియు కోరుతున్నారు; ఇక ఘర్షణ తప్పదని వేరే చెప్ప నవసరము లేదు.

**జమీందారుల సమావేశము**

లక్నోలో దర్భాంగ మహారాజాధిరాజు అధ్యక్షతన జరిగిన సమావేశము మరికొన్నితీర్మానాలు గావించింది. కమ్యూనిస్టు ఆందోళనము, ప్రచారము భారత దేశములో సాగ నివ్వకుండ చేయడానికి పూనుకుంటుందట! బీహారులో వ్యవసాయముపై ఎక్కువ ఆదాయము వచ్చువారిపై వేసిన వ్యవసాయక ఆదాయపు పన్ను, తమ సనదునకు, పర్మనెంటు సెటిల్మెంటుకు వ్యతిరేకమని దానిని తీవ్రంగా నిరశించారు! వారి హక్కులకు సంబంధించిన ఏచట్టమునైనా, జమీందారులలో అధిక సంఖ్యాకులు అంగీకరిస్తేనే ఆచరణ లోకి తేవాలట!

కాని జమీందారులలోనే పైన తెలియ చేసిన తమ కోర్కెలను ఈడేర్చుకోడానికి అవలంబించ వలసిన పద్ధతులను గూర్చి రెండు దృక్పథాలున్నాయి. షా‌ల్‌మసూద్ అహమ్మద్ హరిప్రసాద్‌లాల్ మొదలగు వారు కాంగ్రెసుతో ఎట్టి రాజీగాని, సంప్రదింపులుగాని చేయకూడదని, బ్రిటిషు ప్రభుత్వ సహాయముతో తమ హక్కుల నిలుపుకోవాలనే దృక్పథము తీసుకున్నారు. కాని టి. సి. గోస్వామి (బెంగాలు). చండేశ్వర ప్రసాద్ నరసింగు (బీహారు) మొదలగు వారు "కాంగ్రెసు చాల బలిష్ఠమైన సంఘమూ, చాల ప్రజాపలుకుబడి గల సంఘము, దానితో విరోధము వహించడము తమకు ఆత్మవినాశకరము కాన కాంగ్రెసులోని ధనికవర్గముతో, రాజీపడి సోషలిస్టులను అరికట్టడము మంచిదని" వాదించారు. దర్భాంగ మహారాజు కూడ,భారతీయ బూర్జువావర్గము (ధనికవర్గము)తో భారతీయ జమీందారులు కలిస్తేనే ఒకరి కొకరు అండగా నిలబడితేనే భవిష్యత్తు తమకు అనుకూలంగా ఉంటుందని అభిప్రాయమిచ్చాడు.

ఈ తీర్మానముపై తీవ్రంగా చర్చ సాగిన పిమ్మట కాంగ్రెసుతో రాజీ సంప్రదింపులు ఆరంభించి ఒక ఒడంబడిక చేసుకోడానికి 25 మందితో కూడిన ఒక కమిటీని నియమించారు. కాంగ్రెసు నాయకులు ఈ వలలో పడతారా? పడరు. పడకుండా చేయవలెననిన బాధ్యత ప్రజాసామాన్యము మీద ఉంది. తప్పకుండా వారు తమ బాధ్యతను జయప్రదముగా నిర్వహించ గలరు కూడ!

కాంగ్రెసులో చీలికను కల్గించడానికి, కాంగ్రెసు నాయకులతో ఒడంబడిక కుదుర్చు కొనమని ఒక వైపు జమీందార్లను ప్రోత్సాహిస్తూ ఉంది బ్రిటిషు ప్రభుత్వము. మరియొకవైపు ఫెడరేషనును అమలులోకి తీసుకొని వచ్చుటకు సంస్థానాధీశులపై ఒత్తిడి తెస్తూ ఉంది.

**సంస్థానాధీశుల కోర్కెలు**

స్వదేశ సంస్థానాధీశుల దివానులు బ్రిటిషు ప్రభుత్వానికి ఫెడరేషనులో చేరేవిషయము ఏమి జవాబుచెప్పాలో నిర్ణయించుకోడానికి బొంబాయిలో సమావేశమయ్యారు. ఇండియా ఆక్టులో ఇప్పటికితెచ్చిన సంకుచిత సవరణలు వారికింకను తృప్తిని కలిగించలేదు. ఫెడరలు శాసనసభ శాసనములు చేసినను వానిని సంస్థానాలలో అమలు జరుపుటనుగూర్చి ఫెడరలు మంత్రివర్గము సంస్థానాలలో జోక్యము కలిగించుకోగూడదని చట్టములో ఒకక్లాజు తేవాలని సూచించారు. కనీసము అలా వాగ్దానమైనా చేయాలన్నారు. అంతేగాక ప్రజాబలముగల ఫెడరలు కాబినెటు, తమకు బ్రిటిషురాజుకు జరిగిన సంధి పత్రాలలో తమకు ఇవ్వబడిన హక్కులను భగ్నముగావిస్తే, వైస్రాయి జోక్యము కలిగించుకోడానికి వెనుకంజ వేయవచ్చునని భయాన్ని వెల్లడించారు. అట్టి పరిస్థితి కలుగకుండా చూడడానికి చట్టములో మార్పుగాని కనీసము వాగ్దానముగాని కావలని కోరారు. తాము ఇప్పుడు ఇతర రాష్ట్రాలనుండి తమ సంస్థానాలలోకి వచ్చు పోవు వస్తువులపై సుంకములు వేస్తూ ఉన్నట్లే ముందుకూడ వేయడానికి హక్కుండాలని కోరారు. తమ సంస్థానాలలో ఏమైన అల్లరులు, ప్రజా తిరుగుబాటులు కలిగితే సైన్యాన్ని ఫెడరలు కాబినెటు ఇష్టముమీదగాని, చక్రవర్తి ఇష్టముమీదగాని ఆధారపడకనే విధిగా పంపించునట్లుండాలని కూడా కోరారు. ఈ హక్కుల నన్నిటిని స్వదేశ సంస్థానాధీశులకు ప్రసాదిస్తే ఇక ప్రజాసామాన్యానికి మిగిలే హక్కులేమి ఉంటాయో!

**రాజకోట**

స్వదేశ సంస్థానాధీశు లీవిధంగా ఫెడరేషనును తమకు అనుకూలంగా మార్పించుకోడానికి ప్రయత్నాలు చేస్తూఉన్నారు. అంతటితో తృప్తిచెందక ప్రజా పోరాటాల ఫలితముగా తామిదివరకు ఇచ్చిన వాగ్దానములను నెరవేర్చకుండుటకు అనేక విధాల ప్రయత్నిస్తున్నారు. ఈ సందర్భాన ముఖ్యంగా గమనించవలసినది రాజకోట విషయమై, గాంధిజీకి అనుకూలంగా భారతదేశపు ఫెడరలు కోర్టు ప్రధానజడ్జి నిర్ణయమిచ్చాడు. గాంధిజీ రాజకోట రాజు పేరు ప్రతిష్ఠలు కాపాడదలచి, ఇది వరకు అతడు నియమించిన నలుగురికి కూడ సంస్కరణల సూచించు కమిటీలో స్థానము కల్గజేయా లనుకున్నాడు. కమిటీ సభ్యులను పదిమందికన్నా ఎక్కువ చేయమని రాజ



కోట ప్రజా పరిషత్ తరపున నియమింపబడు 7 గురికి, ఒకవోటు మెజారిటీ ఉంటే తానంగీకరిస్తానని రాజాకువ్రాశాడు, కాని రాజకోట రాజు నిరాకరించాడు. అతని ఉద్దేశము, మహమ్మదీయులను, భయ్యతులను రెచ్చగొట్టితే, వారికి మూడు స్థానాలు, వల్లభభాయి తాను సూచించు పేర్లలో ఇచ్చున్నయి, ఆముగ్గురు తాను నియమించు ముగ్గురుకలని 6 గురు, కమిటీలో మెజారిటీ తనకే ఉంటుందనీ ఊహించాడు. గాంధిజీ భయ్యాతులతోను, మహమ్మదీయులతోను చాలకాలము సంభాషణలు జరిపాడు. వారు పరిషద్ సభ్యులు చెప్పినట్లు వారితో కలసి నడుచుకొనేటట్లయితే, వార్నికూడ వల్లభభాయి సూచించవలసిన పేర్లలోనే సూచిస్తామని చెప్పాడు. దానికి బ్రిటిషు ప్రభుత్వముచేతను, రాజాచేతను రెచ్చగొట్టబడుతున్న వారు అంగీకరించలేదు. గాంధిజీ విధిలేక 7 గురిని ప్రజా పరిషద్ సభ్యులనే నియమించాడు. వీరు కేవలము ఏ ఒక కులము, మతము వారి లాభాలను మనస్సు నందిడుకొనక, రాజకోట ప్రజాసామాన్యమున కంతటికి లాభకరమగు రాజ్యాంగ విధానమును సూచిస్తారనీ, అల్పసంఖ్యాకులు తమ హక్కులకు భంగము కలుగుతుందని భయపడవద్దనీ హెచ్చరించాడు.

అయినా అల్లరి చేయదలచు కొన్నవారు, అల్లరి చేయమని వెనుకనుండి బ్రిటిషు ప్రభుత్వము, రాజకోట రాజు ప్రోత్సాహము చేస్తూ ఉంటే ఊరుకుంటారా? గాంధిజీ ప్రార్థనలు జరుపుతూ ఉంటే, అచ్చటికి వెళ్లి కేకలు, పెడబొబ్బలు పెట్టారు. గాంధిజీ తన ప్రార్థనలను ముగించి తన నివాసస్థానానికి పోతూ ఉన్నప్పుడు చుట్టూ మూగి ఊపిరాడకుండా జేశారు.

గాంధీజీ సలహా ప్రకారము తాత్కాలికంగా సత్యాగ్రహము సంస్థానాలలో ఆపుచేయ బడితే, ఇదే అదను అనుకొని ప్రజాశక్తిని అణచడానికి స్వదేశ సంస్థానాధీశులుఇలా ఆరంభిస్తున్నారు. దాని ఫలితమే కొల్హాపూరు ప్రజాపరిషత్తును నిషేధించమ, మైసూరు, తిరువాన్కూరులలో నిర్బంధవిధానము కొనసాగిస్తూ ఉండడము.

**మైసూరు:**

ఈవారము శ్రీ దాసప్ప అధ్యక్షతన గతసంవత్సరము పోలీసుల కాల్పుల జరిగిన విదురశ్వద్ధములో మైసూరు కాంగ్రెసు సమావేశము జరిగింది. శ్రీ దాసప్ప రైతుల కష్టాలను, వారి బీదతనాన్ని వర్ణించి మైసూరు ఫామ్సు కమిటీని బహిష్కరించ వలసిన అవసరమును తెలియ జేశాడు. అది సూచించిన ద్వంద్వ ప్రభుత్వము తమ కేమాత్రము అంగీకారము కాదనియు, పూర్తిగా బాధ్యతాయుత స్వపరిపాలన కావాలనీ మరి యెట్టి మధ్యంతర రాజ్యాంగ విధానము అయినా ప్రజలను హాని కలుగజేయుననియు తెలియజేశాడు. అట్టి పూర్ణబాధ్యతాయుత ప్రభుత్వాన్ని సంపాదించడానికి తగిన కట్టుబాటు, సంఘటన ఏర్పరచుకొనమని చెప్పాడు.

అచ్చటనే మైసూరు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సమావేశము జరుగవలసి యుండినది. దానికి వచ్చియుండిన కామ్రేడ్ కమలాదేవి చట్టోపాధ్యాయి గాని ఏ మీటింగులకు హాజరు కావద్దనీ, ఏ మీటింగులలోను ఉపన్యాసా లివ్వవద్దనీ జిల్లా మేజిస్ట్రేటు సలహా ఇచ్చాడు గాని ఆ సలహాను తృణీకరించివేసింది కమలాదేవి; సంస్థానాలలో, మాడల్ సంస్థానాలలోనే పౌరసత్వ హక్కు లీలాగు ఉన్నాయి!

ఫెడరేషన్ అమలులోకి తీసుక రమ్మని సలహానిచ్చే వైస్రాయిని సంతృప్తి పరచడానికి సంస్థానాధీశులు ఇలా ప్రవర్తించుతున్నారు.

ఇట్టి ఫెడరేషనును ఎదుర్కోడానికి కాంగ్రెసు మంత్రివర్గాలు ప్రజాసామాన్యాన్ని కూడగట్టుక రావడానికి ప్రయోగకరములగు పనులు చేస్తూనేఉన్నాయి.

**అప్పులను తగ్గించే బిల్లు**

సంయుక్తరాష్ట్రాలలో మంత్రివర్గము రైతులయొక్క, కార్మికులయొక్క అప్పులను తగ్గించడానికి ఒక బిల్లును తెచ్చింది. ఇది సంవత్సరానికి 1000 రూపాయలు ప్రభుత్వానికి శిస్తుగా గాని, లేక జమీందారులకు మగతాగా గాని కట్టువారికి వర్తిస్తుంది. నెలకు 60 రూపాయల లోపు జీతము వచ్చువారి కందరికికూడ ఇది వర్తిస్తుంది. తీసుకొన్న తణఖా అప్పులమీద నూటికి సంవత్సరానికి 5 రూపాయల వంతున సాధారణ (Simple Interest) మొదటనుండి కట్టుతారు. ఆ ప్రకారము ఎంత ఇవ్వవలని ఉంటుందో ఆ మొత్తం చెల్లించియుంటే అప్పు రద్దు అవుతుంది. తణఖా అప్పులుకాక మామూలు అప్పులు అయితే నూటికి సంవత్సరానికి 6 రూపాయలు సాధారణ వడ్డీవంతున లెక్క కట్టుతారు. డిక్రీలిచ్చిన అప్పులకుకూడ ఈ బిల్లు వర్తిస్తుంది. 500 రూపాయలు శిస్తుగాని, మగతాగాని సంవత్సరానికి కట్టు వ్యవసాయదారులకు నెలకు 60 రూపాయల లోపు జీతము వచ్చువారికి దండుపాత్ సూత్రముకూడ వర్తిస్తుంది. అంటే వారు తాము తీసుకొన్న అప్పుకు రెండింతలు చెల్లించియుంటే అప్పు రద్దు అవుతుంది.

**లోకలు బోర్డులలో అందరికీ ఓటు**

మధ్య పరగణాలలో మ్యునిసిపాలిటీలకు, స్థానిక సంస్థలకు (లోకలుబోర్డులకు) యుక్తవయస్సు వచ్చినవారందరు ఓటర్లుగా పరిగణించబడుటకు ఒక బిల్లు తేబడింది. ఈలాంటి బిల్లును ఒక్క యు. పి. లో తప్ప మరి ఇతర కాంగ్రెసురాష్ట్రాలలో ఇంతవరకు తీసుక రాలేదు. ప్రజాతంత్ర హక్కులకు, ప్రజలు మరింత ఎక్కువగా పాల్గొనుటకు అవకాశము ఇది కలిగిస్తుంది. అందుచే మిగిలిన కాంగ్రెసు రాష్ట్రాలుకూడ త్వరలో తమ లోకలుబోర్డు చట్టాలను యీరీతిగా మార్చాలి!

**స్త్రీల హక్కులు**

సాంఘిక విషయాలలో కూడ కాంగ్రెసు మంత్రివర్గాలున్న స్థలములో వెనుకటి ప్రభుత్వములకన్న మున్నందుకు వెళ్ళుతున్నారు. బొంబాయి రాష్ట్రములో లీలావతిమున్షీ "భార్య జీవించినపుడు మరియొకవివాహము చేసుకోవడము నిషేధించడానికి ఒకబిల్లు ప్రతిపాదించినది. అలాచేసుకొన్నవి వివాహాలు క్రింద పరిగణింపబడవు. చేసుకొన్నవారికి, చేసినవారికి శిక్ష విధింపబడుతుంది." ఈ బిల్లును ప్రతిపాదించడానికి కారణములనుగూర్చి ఈలా తెలియజేసింది. "బహు భార్యా విధానము స్త్రీలను పశువులుగా చూచే స్వభావమువలననే కలుగుతుంది. వారిని అలా పరిగణించడానికికూడ ఇది కారణ మవుతుంది." మూడు మాసాలలో ప్రజాభిప్రాయము తెలుసుకోవాలని తీర్మానించబడింది.

బొంబాయి శాసనసభలోనే హిందువులలో వివాహములను కొన్ని పరిస్థితులలో రద్దు చేయడానికి, వివాహాలు చెల్లకుండా చేయడానికి, భార్యాభర్తల విడివిడిగా ఉండడానికి హక్కును ఇస్తూ మరియొక బిల్లు కూడ తేబడింది. దీనిపైకూడ ప్రజాభిప్రాయము తెలుసుకోవాలని తీర్మానించబడింది.

బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గము సాంఘిక విషయములలో ముందుకు పోతూఉంటే ఢిల్లీ అస్సెంబ్లీలో డాక్టరు దేశముఖు హిందూస్త్రీలు విడాకులిచ్చే బిల్లును ప్రతిపాదించినపుడు, ప్రభుత్వపు న్యాయశాఖా సభ్యుడు వ్యతిరేకించాడు. దేశముఖు, తన బిల్లులో, భర్త భార్యను మూడేండ్లుగా వదిలివేసి యున్ననూ, భర్త నపుంసకుడైనా, లేక మరియొక స్త్రీని వివాహము చేసుకొనినా, భార్య కోరినచో విడాకు లివ్వాలి, ఈ బిల్లులో స్త్రీలకు మాత్రమే ఇట్టి హక్కు ఇవ్వాలని, ఉంది. పురుషులకు కూడ అట్టి హక్కు ఇవ్వాలనీ విడాకు లిచ్చినపిదప బిడ్డల విషయముగాని, భరణము విషయముగాని, మరి ఇట్టి ఇతర ముఖ్య విషయాలనుగూర్చి ఇందులో ఏమీ లేదు. ఇంత లోపభూయిష్టమైన బిల్లు పనికిరాదని ప్రభుత్వసభ్యుని వాదన. లోపాలను తొలగించడానికి ప్రయత్నించాలిగాని అసలే బిల్లును వ్యతిరేకించడము, విదేశీయ ప్రభుత్వము యొక్క అభివృద్ధి వ్యతిరేక విధానాన్ని మాత్రము తెలియజేస్తూ ఉంది.

దేశముఖు బిల్లును అంగీకరించక పోతే పోనివ్వండి. హెడ్డిగారు స్త్రీలకు ప్రస్తుత చట్టాలలో ఎట్టి హక్కులున్నదీ, ఎట్టి సంస్కరణము లనుభవించు చున్నదీని విచారించడానికి ఒక కమిటీని వేయమని ఒక తీర్మానాన్ని తెచ్చాడు.

(1) స్త్రీలకు ఆస్తిపై ఏమిహక్కు ఉండునదీ, (2) బిడ్డలపై సంరక్షణ విషయములో ఎట్టి హక్కులుండునదీ (3) స్త్రీలకు భరణపు హక్కులేమి ఉండునదీ (4) ఒక జాయింటు కుటుంబములోని ఆస్తిలో స్త్రీకి ఎట్టి హక్కులుండునదీ (5) వారసత్వపు హక్కులేమి ఉండునదీ (6) వివాహపు హక్కులేమి ఉండునదీ, ఈకమిటీ విచారించాలి.

కాని కేవలము భరణము, నివాసమునుగూర్చి స్త్రీకి ఉన్న హక్కులను ఇబ్బందులను విచారించి తగిన చట్టములను సూచించుటకు మాత్రము ఒక కమిటీ వేయాలని సవరణను ప్రభుత్వ సభ్యునితో రాజీపడి ప్రతిపాదించాడు దేశముఖు! యస్. యం. జోషి, బి. దాస్, కె. సంతానం స్త్రీలకు పురుషులతోపాటు సమానబాగా హక్కులుండాలని,కమిటీ విచారించవలసిన విషయాలను సంకుచిత పర్చడము బాగాలేదని ఆక్షేపించారు! అయినా దేశముఖు సవరణ ప్యాసయింది. కాంగ్రెసు సభ్యులలో ఎక్కువమంది ఈ సవరణకు అనుకూలంగా ఓటుచేయడము విచారకరము.

**వి. వి. గిరి కార్మికులు.**

మద్రాసు కార్మిక మంత్రి వి. వి. గిరిగారు ఈ మధ్య నెల్లిమర్లలో మాట్లాడుతూ, కార్మికులు సమ్మె చేయడానికి ముందు కొన్ని షరతులు గమనించాలన్నాడు. (1) కార్మికుల కోర్కెలు న్యాయమైనవిగా ఉండాలి. (2) యజమానులతో ఈ కోర్కెలెంత న్యాయమైనదీ నచ్చ చెప్పడానికి చర్చించడానికి పూర్తిగా అన్నివిధాల ప్రయత్నించాలి. (3) ప్రజాసామాన్యానికి తమకోర్కెలు న్యాయ మయినవని నచ్చచెప్పి యుండాలి. దీనివలన ప్రజల సానుభూతిని తమ పోరాటానికి సాదంకల్గువారు ఈ మూడు షరతులలో మేము ఏకీ భవిస్తున్నాము. కార్మికు లెప్పుడూ ఈపనులన్నీ గావించిన పిమ్మట సమ్మెలు చేస్తారు. ఎందుకంటే యజమానులతో ఎంత చర్చించినా, కార్మికుల కోర్కెల లోని న్యాయము వారికెప్పుడూ నచ్చదు. ఎప్పుడూ అంగీకరించరు. కాంగ్రెసు మంత్రివర్గము వచ్చిన పిదప కార్మికులు నిర్భయముగా సంఘాలు ఏర్పరచుకోగలుగుతున్నారనీ, తాము త్వరలో కార్మికుల కనుకూలమైన చట్టాలు చేయబోతూ ఉన్నామనీ చెప్పారు. త్వరలో అట్టి చట్టాలుచేసి కాంగ్రెసును కార్మికులు ప్రేమించేటట్లు, బలపర్చేటట్లు చేసుకోవాలి. దాని వలన త్వరలో బ్రిటిషు ప్రభుత్వంతో రాబోవు పోరాటానికి మన బలము ఎక్కువ చేసుకోగల్గుతాము.

**జవ్హారిలాల్ సింహనాదము**

జవ్హారిలాల్ ఇండియాచట్టములోని సంకుచితమగు మార్పుల మూలాన దేశములో పోరాటము వస్తుంది. తయారు కమ్మన్నాడు. కుల, మత పోరాటాలు ఈ ప్రధాన సమస్య నుండి, నిరుద్యోగ సమస్యనుండి, వ్యవసాయదారుల సమస్యనుండి దృష్టిని మరల్చుతాయి కాన దానిని మానివేసి పోరాటానికి తయారుకావాలన్నాడు. మంత్రివర్గాలు ఇండియాచట్టములోని ఈ మార్పులను లెక్క చేయక మామూలుగనే రాష్ట్రప్రభుత్వాలు తమ పూర్తి అధికారాలను చెలాయించాలని సూచించాడు.

కాని ఈలా చేయాలంటే మొదట కావలసినది వాలంటీరు దళము. యు. పి. లోను, కేరళలోను అవి ఇదివరకే ఏర్పరచబడ్డాయి. మహాకోసలలోకూడ 25 వేల మందిని డిశెంబరు నెలాఖరులోపల తయారుచేయబోతున్నారు! మన ఆంధ్రరాష్ట్రములోపది వేల మందినైనా తయారుచేయాలి!ఆంధ్ర యువకులు, ఆంధ్ర నాయకులు, ఆంధ్ర ప్రజలు, ఈ పరీక్షాసమయములో వెనుకపడతారా? పడరని కూడ మా దృఢ విశ్వాసం!

# పరిణీత

## శరశ్చంద్రచటర్జీ

విరచితం

"చక్రపాణి"
అనువాదం

ముక్కలు క్రింద పెట్టి మనోరమ ముఖంవంక చూస్తూ లలిత కుంఠితభావంతో 'పోతాను పిన్నీ!' అని అన్నది.

'అదెలాగే, ఈ చుట్టు తిరగనివ్వు' అన్నది మనోరమ లలిత చేయి పట్టుకుని.

చేయి విడిపించుకుని లలిత వ్యాకులపాటుతో లేచి నిలబడి "కాదు పిన్నీ, వారికి చాలా కోపం వస్తుంది" అని తొందరగా వెళ్ళిపోయింది.

"ఈ శేఖరదా ఎక్కడనుంచి వచ్చాడు అక్కయ్యా?" అని అడిగాడు గిరీన్.

"అదిగో. ఆ ఎదురుగా పెద్దమేడ కనపడటంలేదూ? వాళ్ళబ్బాయి" అన్నది మనోరమ.

"ఓ ఆ ఇల్లా! నవీనబాబు వీళ్ళకు దగ్గరవాడు కాదూ?"

మనోరమ ఒక మాటు కుమార్తె వంక చూసి మందహాసంచేస్తూ "చాలా దగ్గరవాడు! అందుచేతనే వాళ్ళఇల్లు కాస్తా కలుపుకోవాలని కాచుకు కూర్చున్నాడు" అన్నది.

గిరీన్ ఆశ్చర్యంతో చూస్తూ ఊరుకున్నాడు.

అప్పుడు మనోరమ, గత సంవత్సరం ధనాభావంచేత గురుచరణబాబు రెండవ కుమార్తె పెళ్లి ఎలా ఆగిపోయిందీ, తర్వాత ఇల్లు తాకట్టు పెట్టి నవీనరాయ్ దగ్గర పెద్ద వడ్డీకి డబ్బు ఎలా తీసుకున్నదీ, మహా రసవత్తరంగా వర్ణించి—"ఈ అప్పు ఏవిధంగాను తీరదు: చివరకు ఈఇల్లు నవీనరాయే కలుపుకుని పాత డాబా పడగొట్టి చిన్నకొడుకు శేఖరుని కోసం పెద్ద మేడ వేస్తాడు. ఇద్దరి కొడుకులకు వేరే వేరే ఇళ్ళు: ఉద్దేశ్యము మంచిదే!" అని సొంత అభిప్రాయాన్ని చెప్పింది.

ఈ ఇతిహాసం గిరీనుకు దుఃఖం కలిగించింది—"సరే అక్కయ్యా! గురుచరణబాబుకు ఇంకా ఆడపిల్లలున్నారుకదా — వాళ్ళ పెళ్ళిళ్ళు ఎలా చేస్తాడు?" అని అడిగాడు.

"తన పిల్లలే కాదు పైగా లలిత కూడా ఉంది. ఆ పిల్లకు తల్లితండ్రులు లేరు. ఆమె భారం అంతా ఈ బీదవాళ్ళమీదనే పడ్డది. ఈడు వచ్చిన పిల్ల. ఈ సంవత్సరములో పెళ్ళిచేయక తప్పదు. వాళ్ళ సమాజంలో సహాయం చేసేవాళ్ళెవరూ లేకపోయినా వెలి వేయడానికి అందరూ సిద్ధమవుతారు. మన పని సుఖం కాదూ గిరీన్?" అని అడిగింది.

గిరీన్ జవాబివ్వలేదు. ఆమె మరల చెప్ప నారంభించింది.

"ఆవాళ లలితసంగతి వచ్చి వాళ్ళ అత్త నాదగ్గర ఛోరునఏడ్చింది. పెళ్ళి ఎలా చెయ్యాలో వాళ్ళ కేమీ తోచటం లేదు. ఈ దిగులుతో గురుచరణబాబు నిద్రాహారాలు మానేశాడు—ఆఁ గిరీన్! ముంగేరులో నీకు చాలామంది మిత్రులున్నారు కదా—వాళ్ళలో పిల్లను చూచి చేసుకునేవారెవరూ లేరా? ఇలాంటి పిల్ల దొరకటం చాలా కష్టం."

గిరీన్ విషణ్ణభావముతో చిన్న నవ్వు నవ్వి— "స్నేహితు లెవరున్నారు అక్కయ్యా!— కాని నేను డబ్బు సహాయమైతే మాత్రం చేయగలను" అన్నాడు.

గిరీన్ తండ్రి డాక్టరీ చేసి చాలా ధనమూ, స్థిరాస్తులూ కూడబెట్టి పోయాడు. ఇప్పుడు వాటికి ఇత నొక్కడే వారసుడు.

"సైకం నువ్వు అప్పుగా ఇస్తావా?"

"ఇంకా అప్పేమిటి, అక్కయ్యా! తీర్చగలిగితే తీరుస్తారు. లేక పోతే లేదు."

మనోరమ విస్మయంతో "డబ్బిస్తే నీకు లాభం? వాళ్ళు నీకు దగ్గర వాళ్లు కారాయె, ఆఖరకు సమాజీయులైనా కాదాయె. ఇలా యెవరన్నా ఇతర్లకు డబ్బిస్తారా?" అని అడిగింది.

గిరీన్ మనోరమ ముఖ భంగిమ చూసి నవ్వుతూ "సమాజీయులు కాకపోయినా బెంగాలీలేగా! వారికి ధనాభావంగా ఉన్నది. నాకు ధనము విస్తారంగా ఉన్నది. ఒకమాటు అడిగి చూడు అక్కయ్యా! వాళ్లు ఒప్పుకుంటారేమో! నేనిస్తాను. లలిత వాళ్ళకూ ఏమీకాదు, మనకూ ఏమీకాదు. ఆ పిల్ల పెళ్ళి కర్చులన్నీ నేనే భరిస్తాను" అన్నాడు.

అతని మాటలు మనోరమకు అంతగా సంతుష్టి కలిగించలేదు. నిజంగా ఆమెకు యిందులో వచ్చేదీ పోయేదీ ఏమీలేదు. చాలామంది స్త్రీలు ఇంతడబ్బు ఒకరికి ఒకరు ఉచితంగా ఇస్తుండడం చూసి సంతోషించలేరు. అందులో ఈమె ఒకతె.

చారు ఇంతవరకు ఏమీ మాట్లాడకుండా వింటూ ఉన్నది. ఇప్పుడు సంతోషముతో ఒక్క గంతు వేసి "అలాగే ఇవ్వు మామా! నేను వాళ్ళ అత్తకు చెప్పి వస్తాను" అన్నది.

చారును బెదిరిస్తు "నువ్వూరుకో చారూ! చిన్నపిల్లవి. ఇలాంటి విషయాల్లో జోక్యం చేసుకోబోకు. చెప్పాల్సి వుంటే నేనే చెప్తుతాను." అన్నది మనోరమ.

"అలాగే చెప్పు అక్కయ్యా! మొన్న రోడ్డుమీదనే కాసేపు గురుచరణబాబుతో మాట్లాడాను. మాటలను బట్టి చూస్తే చాలా మంచివాడుగా కనబడ్డాడు. నువ్వేమంటావు?" అన్నాడుగిరీను

"నేనూ అంతే అంటాను. నే నేమిటి? అందరూ అదే అంటారు. వాళ్ళ భార్యాభర్తలు చాలా అమాయకులు. అలాంటివారు ఆఖరికి ఇల్లూ వాకిలి లేకుండా పోతారేమోనని నాకు చింతగా వున్నది. దానికి దృష్టాంతరము చూడు, గిరీన్. శేఖరుడు పిలిచాడనగానే లలిత ఎలా గాభరా పడుతూ పరిగెత్తిందో! గురుచరణబాబు కుటుంబమంతా వారికి అమ్ముడు పోయినట్టుగా వుంటారు. కాని వీరెంత వినయము చూపినా ముఖస్తుతి చేసినా ఒక మాటు నవీనరాయ్ చేతిలో చిక్కినాక తప్పించుకు బయట పడటం అసంభవం!"

"అలా అయితే తప్పకుండా చెప్పుతావా, అక్కయ్యా"

"అలాగే అడిగిచూస్తాను" అని మందహాసం చేసి "సరేగాని నీకు దీనిలో ఇంత శ్రద్ధ ఎందుకు గిరీన్?" అని అడిగింది.

"శ్రద్ధేముంది అక్కయ్యా! కష్టనష్టాలల్లో ఒకరికొకరు సహాయం పడవద్దూ," అని కొంచెం సిగ్గుపడుతూ వాకిటిదాకా వెళ్ళి మళ్ళీ తిరిగివచ్చి కూర్చున్నాడు.

"మళ్ళీవచ్చి కూర్చున్నావే" అన్నది మనోరమ.

"నువ్వు చెప్పిందంతా నిజం కాదనుకుంటున్నాను, అక్కయ్యా!" అన్నాడు గిరీనుడు.

"ఎందుకని?" అన్నది మనోరమ విస్మయముతో.

"వాళ్ళ లలిత డబ్బు ఖర్చుపెట్టే వాలకం చూస్తే వాళ్లు దరిద్రులని ఎంత మాత్రం అనుకోటానికి వీల్లేదు అక్కయ్యా! మేము నాటకం చూట్టానికి పోయిన రోజున తాను రాకపోయినా కాళికి పదిరూపాయలిచ్చి పంపింది చారు నడుగు. ఎలా ఖర్చు పెడుతుందో! కనీసం నెలకు యిరవై రూపాయలన్నా లేనిదే ఆ పిల్లకు జరగదు."

"నిజం అమ్మా! అదంతా శేఖరబాబు డబ్బు. ఇప్పుడేకాదు చిన్నప్పటినుంచీ శేఖరబాబు అల్మారీ తెరచి డబ్బు తెస్తూ ఉండేది. ఎవ్వరూ ఏమీ అనరు." అన్నది చారు చేయి ఆడిస్తూ.

మనోరమ కుమార్తెవంక సందిగ్ధభావంతో చూచి—"డబ్బు తీసుకు వెడుతుందని శేఖరబాబుకు తెలుసునా?" అని అడిగింది.

"తెలుసును. ఎదుటనే తాళంతీసి తీసుకొస్తుంది. కిందటి నెల్లో అన్నాకాళీ బొమ్మల పెళ్ళికి అంత డబ్బు ఎవరిచ్చారు? అంతా లలితే నమ్మా."

మనోరమ కొంచెంసేపు ఆలోచించి—"ఎవరికి తెలుసును? కాని కొడుకు మాత్రం తండ్రంత పీనాసివాడుకాదు. తల్లి పోలిక—అందుకనే కాస్త దయా ధర్మాలున్నాయి, అదీకాక లలిత చాలా బుద్ధిమంతురాలు. చిన్నప్పటినుంచీ లలిత అతని దగ్గర ఉండేది. అన్నా అని పిలిచేది. అందుకని ఆమెను అంతా ప్రేమించేవారు. ఆఁ చారూ! నువ్వు వాళ్ళింటికి పోతూ ఉంటావు కదా. ఈ మాఘమాసంలో శేఖరుడి పెళ్ళిట నిజమేనా? ముసలాడు ఈ పెళ్ళికి చాలా డబ్బు వడుక్కుంటున్నాడని విన్నాను!" అని అన్నది.

"ఔనమ్మా! ఈ మాఘ మాసంలోనే అంతా స్థిరపడింది." అన్నది చారు.



౨

గురుచరణుడు చిన్నల్లో చిన్నగానూ పెద్దల్లో పెద్దగా కలిసిపోయే స్వభావం కలవాడు. రెండు రోజుల పరిచయానికే వీరికి గిరీన్‌కూ బాగా స్నేహం కుదిరింది. గురుచరణుని మనస్సు అంత దృఢమైంది కాదు. వీరికి తర్కించటం చాలా ఇష్టం. కాని తర్కంలో ఓడిపోయినప్పటికీ అసంతుష్టి చెందేవాడు కాడు.

రోజూ సాయంత్రం 'టీ'కి రమ్మని గిరీనుని ఇదివరకే ఆహ్వానించాడు. గురుచరణుడు ఆఫీసునుంచి వచ్చేసరికి ప్రొద్దు క్రుంకుతూండేది. కాళ్ళూ చేతులూ కడుక్కుని లలితా! 'టీ' తయారయిందా తల్లీ! కాళీ, పోపో! త్వరగా పోయి మీ గిరీన్ మామను పిలుచుకురా. అంటూ ఉండేవాడు. తర్వాత ఇద్దరూ కూర్చుని టీ త్రాగటం, తర్కించటం జరుగుతూ ఉండేది.

లలిత ఒక్కొక్కనాడు మామ చాటున కూర్చుని మాట్లాడకుండా వింటూ ఉండేది. ఇక ఆనాడు గిరీనుకు ఎన్నడూలేని తర్కశక్తి కలిగేది. తరచుగా తర్కం ఆధునిక సమాజానికి ప్రతికూలంగా జరుగుతూ ఉండేది. సామాజిక అత్యాచారం, హృదయహీనత్వం. అసంగత ఉపద్రవాలు మొదలగు సత్యవిషయాలమీదనే చర్చ నడిచేది.

అసలు వీటిని సమర్ధించటానికి తగిన యదార్ధప్రమాణా లేవీ లేవు. అందుచేత గురుచరణుని ఉత్పీడిత అశాంత హృదయం గిరీన్ మాటలతో ఏకీభవించిపోయేది.

"నిజమే గిరీన్! ఒకరు చెప్పారని కాకపోయినా ఎవరి బిడ్డలకు వాళ్లు యుక్తవయస్సు రాగానే పెళ్ళి చేయాలిసిందే. కాని చేసే దెలా? పిల్లకు యీడు వొచ్చింది. పెళ్ళి చేసివేయమంటుంది సమాజం; కాని చేసే బందోబస్తేమీ చేయదు! చూడు, గిరీన్! నాసంగతే తీసుకుందాము, ఉన్న యిల్లు కాస్తా తాకట్టు పెట్టాను. రెండు రోజులుంటే పిల్లలను వెంటబెట్టుకొని రోడ్డుమీదకు పోయి నిలబడాలి. అప్పుడు సమాజం 'రండి మా యింట్లో వుందురుగాని' అని అనదు. ఏమంటావు?" అని ఆఖరుకు అడిగేవాడు.

గిరీన్ ఏమీ జవాబిచ్చేవాడు కాడు. గురుచరణుడు మరల ప్రారంభించేవాడు.

"నేను చెప్పేదే యదార్థం. ఇలాంటి సమాజంలో ఉండే కంటే జాతిని వదలుకోవటం మంచిది. కడుపులోనికి లేకపోయినా శాంతిగానైనా ఉండవచ్చును. దుఃఖితుల దుఃఖం అర్ధంచేసుకోలేని సమాజం, అర్ధం చేసుకోపోవటం అలా ఉంచి పైగా గుడ్లుఉరిమి గొంతునొక్కే సమాజం, నాదికాదు, నా బోటి బీదవారిదికాదు. ఈ సమాజం భాగ్యవంతులది; సరే, వారికే ఉండనివ్వు. మాకు అక్కర్లేదు" అని గురుచరణుడు చప్పున ఆగిపోయేవాడు.

ఈ ఖండన మండనాలు లలిత మనస్సు లగ్నంచేసి వినటమే కాకుండా రాత్రిళ్లు ప్రక్కమీద పండుకొని నిద్ర వచ్చేటంతవరకు ఆలోచించి చూసేది. ప్రతిమాటా ఆమెమనస్సులో గంభీరంగా నాటుకుపోయేది. నిజానికి గిరీన్ బాబు చెప్పిన మాటలన్నీ చాలా న్యాయ సంగతమైనవని మనస్సులో అనుకొనేది.

లలితకు మామమీద చాలా ప్రేమ. మామను గిరీనుడు తన వైపుకు లాక్కున్నాడు. అందుచేత గిరీనుడు చెప్పిందల్లా పదహారణాలూ సత్యమని ఆమె అనుకొనేది. మామ తనకోసం చాలా వ్యాకులపడుతున్నాడు. నిద్రాహారాలు వదిలాడు. దుఃఖితుడూ నిర్విరోధీ అగు మామ తనకు ఆశ్రయము ఇవ్వటంచేతనే ఇంత క్లేశం అనుభవిస్తున్నాడు. మామకు జాతి పోతురేదట; ఎందుకు ఇవ్వాళ నా పెళ్ళిచేస్తే, రేపు నేను విధవనైన యింట్లో వుండిపోయినా జాతిపోదు. ఇందులో అందులో భేద మేమున్నది? గిరీన్ మాటల్లోని ప్రతిధ్వనిని తన భావాతుర హృదయంలోనుంచి ఇంకో మాటు బయలుదేరతీసి మరోమాటు విమర్శిస్తూ లలిత నిద్రపోయేది. తన మామ దుఃఖం గ్రహించి సానుభూతిగా మాట్లాడినవారితో ఏకీభవించకుండానూ శ్రద్ధ చూపించకుండానూ లలిత వుండలేకపోయేది. ఆమె గిరీంద్రునికి అంతరంగికభక్తి జూపించ నారంభించింది. క్రమంగా గురుచరణుని మాదిరిగా ఆమెకూడా సాయంకాలం 'టీ' వేళ ఎప్పుడవుతుందా అని చూస్తూ ఉండేది.

పూర్వం గిరీనుడు లలితను 'మీరు' అని సంబోధించేవాడు. కాని గురుచరణుడు వారించి "మీరు అని పిలుస్తావెందుకు! గిరీన్, నీవు అని పిలువు" అన్నాడు. అప్పటినుంచి గిరీనుడు లలితను 'నీవు' అని పిలువ నారంభించాడు.

"నువ్వు టీ త్రాగావా లలితా?" అని ఒకరోజున గిరీనుడు అడిగాడు.

లలిత తలవంచుకొని త్రాగనన్నట్లు తల తిప్పింది.

"వాళ్ళ శేఖరదా వద్దన్నాడు. స్త్రీలు టీ త్రాగటం అతనికిష్టంలేదు." అని గురుచరణుడు చెప్పాడు. ఈ కారణం గిరీంద్రునికి అంత తృప్తికరంగా లేదని లలిత గ్రహించింది. ఇవ్వాళ శనివారము. ఇతర దినాలకంటే యివ్వాళ సభ ఇంకా కొంచెం ఎక్కువసేపు ఉంటుంది.

టీ త్రాగటం పూర్తి అయింది. గురుచరణుడు ఇవ్వాళ సంభాషణలో అంత ఉత్సాహంగా పాల్గొనటంలేదు. మధ్య మధ్య అన్యమనస్కంగా ఉంటున్నాడు. గిరీనుడు ఇది సులువుగా గ్రహించి "ఇవ్వాళ మీ ఒంట్లో బాగాలేదనుకుంటాను." అని అన్నాడు.

గురుచరణుడు నోట్లోనుంచి హుక్కా గొట్టంతీసి "ఎందుకులేదు? బాగానే వున్నది." అన్నాడు.

"అయితే ఆఫీసులో ఏమన్నా" తర్వాత గిరీనుడు సంకోచముతో పూర్తిచేయలేదు.

"ఎబ్బే అలాంటి దేమీలేదు." అని గురుచరణుడు గిరీన్ ముఖం వంక జూశాడు. వారి లోపలవున్న ఉద్వేగాన్ని ఎంత అమాయకుడయినా ముఖంచూసి కనిపెట్టవచ్చును.

లలిత ఇదివరకు మాట్లాడేదికాదు. కాని ఇప్పుడిప్పుడే మధ్య మధ్య ఒకటి రెండు మాటలు కలుపుతూ వున్నది. 'అవును మామా! ఇవ్వాళ నీ మనస్సు బాగాలేదు' అన్నది.

గురుచరణుడు పక పక నవ్వి "ఓ. అదా సంగతి! అవును తల్లీ. నువ్వుసరిగ్గా కనిపెట్టావు. ఇవ్వాళ నామనస్సు బాగాలేదు." అని అన్నాడు.

లలితా గిరీనులు వారి ముఖంవంక చూస్తూ వూరుకున్నారు.

"నాస్థితంతా ఎరిగి కూడా నవీనదా నన్ను రోడ్డుమీద నిలబెట్టి కొంచెం కటువుగా మాట్లాడాడు. వారి తప్పు కూడా ఏముందిలే. ఆరు మాసాలయింది; అసలు అలా ఉంచి వడ్డీ కూడా ఒక్క దమ్మిడీ యివ్వలేదు" అని అన్నాడు.

సంగతి గ్రహించి ప్రసంగాన్ని అణచివేయటానికి లలిత చాలా వ్యాకులత చెందినది. ప్రపంచజ్ఞానం తెలియని మామ, ఇతరుల యెదుట లజ్జాకరమైన ఇంటి సంగతులు వెల్లడిస్తాడేమోనని ఆమర్దాతో "నువ్వు దాన్నిగురించి ఆలోచించకు మామా; అది తర్వాత చూడవచ్చును" అన్నది.

కాని గురుచరణుడు ఆమె ఉద్దేశం గ్రహించలేదు. విషణ్ణభావంతో నవ్వి "తర్వాత ఇంకేమి చూస్తావు తల్లీ! అదికాదు గిరీన్! మా యీతల్లి, వాళ్ళ ముసలబ్బాయి ఏమన్నా దిగులుపడుతాడేమోనని విచారిస్తూ ఉంటుంది. కాని బయటివారెవ్వరూ మీ దుఃఖిత మామ ముఖాన్ని చూడదలచటం లేదు లలితా!" అని అన్నాడు.

"ఇవ్వాళ నవీనబాబు ఏమన్నాడు?" గిరీను అడిగాడు.

గిరీనుకు ఈ సంగతంతా తెలుసునని లలిత ఎరగదు. అందుచేత ఈ ప్రశ్న అసంగతమైనదని లలిత కుపితురాలయింది.

"నవీనరాయ్ భార్యకు చాలారోజులనుంచి అజీర్ణవ్యాధి అట. ప్రస్తుతము రోగం కొంచెం ఎక్కువయింది. డాక్టరు గాలిమార్పు అవసరమన్నాడట. ఇప్పుడు డబ్బు అవసరం. అందుచేత వడ్డీ మొత్తమ్మూ అసలులో కొంతా ఇవ్వవల్సి వుంటుంది" అని గురుచరణుడు చెప్పాడు.

గిరీన్ ఒక్క క్షణం ఉండి "మీకు ఒక మాట చెప్పాలని చాలా రోజులనుంచి అనుకుంటూనే చెప్పలేకపోతున్నాను. మీరు మనస్సులో వేరుగా భావించకపోతే చెప్పుతాను" అని మెల్లగా అన్నాడు.

గురుచరణుడు నవ్వి "నాతో చెప్పటానికి ఎవ్వరూ సంకోచించరు. గిరీన్! ఏమిటి సంగతి?" అని అడిగాడు.

"నవీనబాబుది పెద్ద వడ్డీ అని అక్కయ్య చెప్పింది. నా దగ్గర చాలా డబ్బు ఊరకనే పడి ఉంది. ఎందుకూ ఉపయోగించటంలేదు. పైగా వారికి అవసరమని కూడా అంటున్నారు. ఈ అప్పు తీర్చివేయకూడదా?"

# యుద్ధమూ — ప్రపంచశాంతి

కామ్రేడ్ సి. సూర్యనారాయణ

### గత యుద్ధమువలన నష్టాలు.

నవంబరు 11, 1918 సం॥ ప్రపంచ మహాసంగ్రామ ఫలితమైన బీభత్సదృశ్యంమీద తెర దింపబడింది. యుద్ధాల్ని అంతమొందించి, శాంతిని స్థాపించటానికి జరుపబడిన యుద్ధమిది అన్నారు యుద్ధనేతలు. వర్సైల్సు సంధికారులును. సామ్రాజ్యవాదుల పరస్పర వైరుధ్య ఫలితంగా యీక్రింది సంఖ్యలు తెల్పుతాయి.

చచ్చిన సైనికులు కోటిమంది
చచ్చినారనుకోబడ్డవారు 30 లక్షలు
చచ్చిన పురజనులు కోటి 30 లక్షలు
గాయపడినవారు రెండు కోట్లు
బందీలు 30 లక్షలు
యుద్ధం మూలంగా అనాధలు 90 లక్షలు
,, విధవస్త్రీలు 50 లక్షలు
దేశాంతరము నొందినవారు కోటిమంది

చచ్చినవారిని, గాయపడినవారిని కలిపిన సంఖ్య మొత్తం 4 కోట్ల 60 లక్షలు, మొత్తం ఖర్చు యిరుపక్షముల వారికి 56 కోట్ల పౌన్లు. అంటే, అర్ధం ప్రతియింటికి విధవ స్త్రీ. అసంఖ్యాకులైన అనాధ బాలబాలికలు, మిక్కుటమైన దరిద్రబాధ, హెచ్చిన అనారోగ్యము, అన్నిటినిమించి, యీ యుద్ధము విశ్వవిద్యాలయాలను (కేంబ్రిడ్జి అక్సుఫర్డ్) వెర్రిచేసింది, నిష్కపట హృదయములైన యువతీయువకులచే రాష్ట్రోన్నత్యము పేరిట, మానవ సంఘముపై ఘోరకృత్యాలు జరిపించారు. తిరిగి అనేకవేల మంది యువజనులను యుద్ధాగ్నికి ఆహుతిజేశారు. ఈ రాక్షసకృత్యాల దారుణగాధ, రక్తాక్షరాలతో సామ్రాజ్యవాదుల చరిత్రలో ముద్రితమయింది.

కాని యీ యుద్ధఫలితమేమిటి? శాంతి స్థాపనా? ప్రజానురంజనా? శాంతికి స్మశానశాంతి అని అర్ధమిస్తే రెండూనిజమే. యుద్ధ ఫలితంగా విజయమందిన సామ్రాజ్యవాదులకు, హెచ్చిన లాభతృష్ణ. మించిన దోపిడికి తగిన బలము సమకూరింది. నిర్జిత సామ్రాజ్యవాదులకు ప్రపంచాన్ని మరల పంచుకుందామనే ఆశ, కూడా వృద్ధి జెందించింది. అంటే మరల యుద్ధమన్నమాట. ఇది ప్రత్యక్ష్యంగా కనబడుతునేవుంది. ఇది శాంతిస్థాపనకై చేసిన ప్రపంచ యుద్ధంలో ఇమిడివున్న పరమ రహస్యంలోని ఒకభాగము.

### గత యుద్ధం, శాంతికోసంకాదు జరిగింది

పోనీ శాంతికొరకు చేసిన యుద్ధం అనుకుందాం. కాని 1914 సం॥ నుండి జరిగిన చరిత్ర వింతగా కనుపిస్తోంది. శాంతి, శాంతి అని ధ్వనతోంతరాకాలు, ప్రతిధ్వనించేటట్లు పత్రికలు ద్వారా నైతేనేం. వుపన్యాసాల ద్వారానైతేనేం ప్రకటించిన విజేత సామ్రాజ్యవాదాల వికృత చర్యలు చూదాం.

1. వర్సైల్సు సంధి అయిన తరువాత కూడా జర్మను ప్రజలకు ఆహార పదార్ధములు పోకుండా తమ సైన్యాలతో అడ్డుబెట్టారు. జర్మను పసిబాలుర, స్త్రీ, వృద్ధుల కనరాని కష్టనష్టములు. కఠిన హృదయులైన బ్రిటీషు సైనికులను కలవరపరచి తిరుగుబాటుకు కూడా తయారు చేసేనటులను నిదర్శనములు కలవు.

2. సంధిసమకూరినా, శాంతి వాదులైన విజేతలు, రష్యాపై దాడిసల్పారు. నిర్దాక్షిణ్యానికి, నిరంకుశత్వానికి, ఆటపట్టయిన జారుప్రభుత్వాన్ని కూలద్రోసి, క్రొత్తసంఘాన్ని నిర్మిస్తూన్న రష్యను ప్రజలలో జోక్యము కలుగజేసుకొని, అనేకవేల రష్యనులను హింసించారు. దీని ఫలితంగా, వారు చెప్పినశాంతికి అర్ధం సామ్రాజ్యవాదుల శాంతియని. కాబట్టియే ప్రజాశాంతి నెలకొల్పుతూన్న రష్యాపై దాడి వెడలటం.

3. తరువాత యుద్ధమాగిన ఏడాదిలోగానే అతిహేయమైన రాజకీయ కుతంత్రాల ఫలితంగా టర్కీని ముక్కముక్కలుగా జేసి పంచుకోడానికి ప్రయత్నించారు. కాని కెమల్‌పాషా ధైర్యసాహసాలవల్ల భగ్నమనోరథులైనారు.

4. ఇరాక్, పాలస్తయిన్‌లను పెట్రోల్ బావులకొరకై, వశపర్చుకున్నారు. ఇరాక్ దేశాన్ని, బాంబులవర్షంతో వప్పించి, గొంతు ఓగించి, అంతర్జాతీయసమితిలో సభ్యత్వమిప్పించాయి. ఈరీతిగా తమలాభతృష్ణను, పెట్రోల్‌తో శాంతింపచేయ దల్చుకున్నారు బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు.

5. ఇంకోఘనకార్యం ఏమిటంటే, స్వాతంత్ర్యాపేక్షతో, యుద్ధంలో సహాయంచేసిన భారతీయులకి, రౌలట్‌బిల్లు ప్రవేశబెట్టి గుణపాఠం నేర్పారు. దానిద్వారా, మాచెయ్యి బలపరిస్తే మచ్చుకు మారాజ్యం యిలావుంటుందని, కొన్నివేల దారుణహత్యలతోను, భారత స్త్రీలపైన, పసిబాలురపైన అమానుషకృత్యాలు జలియన్ వాలాబాగ్‌లో జరపి చూపించారు. దీనితో భారతీయులకు తీరని ఘాతము కలిగింది.

కొన్నిసంవత్సరాలు దాటినాయి. వింత విషయాలు హెచ్చినవేగంతో విపులమవుతున్నాయి. ఇదివరలో వోడిపోయిన, లేక వెనుకబడిన సామ్రాజ్యవాదులు విజృంభించారు. ప్రపంచాన్ని మళ్లావిభజించుకొనేందుకు, తత్ఫలితంగా మంచూరియాను జపాను దిగమ్రింగటం, అబిసీనియా అంతర్ధాన మవుటం, ఆస్ట్రియా, జెకోస్లోవేకియాలు రూపు మాయటం, తరువాత స్పెయిన్ స్వాతంత్ర్యం గంగలో కలియటం, సోవియట్ బలబడుతుందనే భయంతో, బ్రిటన్, ఫ్రాన్సుల సామ్రాజ్యవాదులు, గుడ్డి మిటర్రిస్టు ఫాసిస్టులకు సహాయంచేయటం. ఈసంగతులు చూడగా తేలేదేమంటే, ప్రపంచయుద్ధం ముందుమాదిరిగా ప్రపంచం అరాజకస్థితిలోనే పడివుంది. కాన యీ యుద్ధతత్వం పరిగ్రహించుకుంటేతప్ప, మానవశాంతికి తగు సహాయము చేయుటీలుండదు. ఈయుద్ధాలలో ప్రజలకేమాత్రం లాభంలేదని తేల్తోంది. విజేతసామ్రాజ్యవాద రాష్ట్రప్రజలు, వోడిపోయిన దేశంలో వారుకూడ తీరని దారిద్ర్యబాధను అనుభవిస్తున్నారు. ఈ క్రింది విషయాలు గమనిస్తే యుద్ధతత్వం కొంత తెలుస్తుంది.

### శాంతిసమయములోకూడ యుద్ధమే సాగుతుంది.

1. ప్రస్తుతము యుద్ధములేనప్పుడు శాంతి అనేది ఒకటుందా? శాంతియనగా యుద్ధములేకపోవుటయని యొక వింత అర్ధము స్ఫురింప వచ్చు. ఇప్పటి పరిస్థితుల్లో శాంతియనగా రెండు యుద్ధముల మధ్య విశ్రాంతికాలమని అర్ధమిస్తోంది. కాని నిజమైన శాంతివుందా? లేదంటాను యీ క్రింది విషయాలు గమనించండి.

(1) ఏ దేశములోగాని నూటికి ఎనుబది మంది చెమటోడ్చి పనిచేస్తూ, ధనధాన్యోత్పత్తికి కారకులై కూడ తిండలేకమాడుతూ, ఏ కొద్ది మంది భోగలాలస జీవనానికో తమ జీవితాన్నంతా వెచ్చించవలసిన అవుసర మున్నప్పుడు అసంతృప్తి, అశాంతి సహజము. అణగద్రొక్కబడి నిరుద్యోగ సమస్యతో పీడింపబడేవారు తప్పకుండా అలజడి చేయకమానరు. కొంత కాలానికి బహిర్గతమై సమ్మెలు మొదలుగా పరిణమించడం, శాంతిభద్రతల పేరిట తుపాకులు పేలడం, పీడిత జనులలో కొందరికి స్మశాన శాంతి చేకూరడం సహజం అయిపోయింది. ఈ ఒక్క నిదర్శనమే (కాల్పులు చీరాలలో కానీ, చిట్టివలసలో కానీండి, అమెరికాలో కానీండి) ప్రభుత్వము వర్గపక్షపాతియని, సంఘంలో ఏ వర్గం పైనుంటే ఆవర్గం చేతులో, పీడిత జనులలోని అశాంతిని అణచడానికి వుపయోగింపబడే నిర్బంధ సాధనమని నిర్ధారణ అవుతుంది.

(2) కాని కొందరికి అనుమానము రావచ్చును. ప్రభుత్వములలో (సామ్రాజ్యవాద) వోటింగుహక్కు మొదలైన సుగుణాలు లేవా, వర్గ విభేదాలు లేకుండా యీ హక్కులు అందరికి వర్తించడం లేదా? అని కాని వీటి యీ హక్కుల చరిత్రను పరీక్షచేసి చూచినట్లయితే అవి పీడితవర్గాలను రక్త ప్రవాహంలో ముంచి కాని ఇవ్వలేదు, మరియూ, తమ స్థిరత్వమునకు భంగంకలుగునను భయమున్నప్పుడే అటువంటి హక్కులు ఆయశాంతిని కొంత తగ్గింపజేయుటానికి యిచ్చారు. మరియూ అనటోల్ ఫ్రాన్సు చెప్పినట్లు సామ్రాజ్యవాద దేశాలలో న్యాయము ఈ రీతిగానుండును "దొంగతనము శిక్షింపబడును. బీదవాడైననూ సరే, భాగ్యవంతుడైననూ సరే. కాని భాగ్యవంతునకు దొంగతనము చేయునవసరమేమి" కాబట్టి వర్గవిభేదాలున్నప్పుడు, యీహక్కుల కెట్టి అర్ధమూ వుండదు.

(3) తరువాత, యీ హక్కులన్నియూ బూటకములనియు, అవసరము వచ్చినప్పుడు సామ్రాజ్యవాదులు, యీ హక్కులను వకదాని వెనుక నొకదానిని రద్దుచేసి, ఫాసిస్టులుగా మావటంకూడా మనం చూచే విషయమే కాబట్టి సామ్రాజ్యవాద పాలితరాష్ట్రాలలో శాంతికి అర్ధం బాలా సంకుచితము, ఎంత కప్పిపుచ్చటానినా, యీ అశాంతి సహజము, ఇది ప్రజ్వరిల్లుచున్న అశాంతి, ఇది నిత్యము జరుగుచున్న వర్గయుద్ధ ప్రకటన. కాని ఒకటే భేదము. శాంతిసమయములోని యుద్ధములో పోరాడునది, పోలీసు దుస్తులలో నున్న సామ్రాజ్యవాదభటులు, చింకి గుడ్డలలోనున్న శ్రామికవర్గముమీద అ యుద్ధ సమయములోని యుద్ధములో పోరాడునది మిలిటరీ దుస్తులలోనుండి వేరొకసామ్రాజ్యవాద భటులమీద, చచ్చునది ప్రజలు. పోరాడించువారు సామ్రాజ్యవాదులు, పోరించునది లాభతృష్ణ.

### యుద్ధానికి కారణాలు సామ్రాజ్యవాద గర్భితవైరుద్ధ్యాలు

2. సామ్రాజ్యవాద సిద్ధాంతానికి, యుద్ధసమస్యకి తీరని లంకె వుంది. దీనికి కారణాలు సామ్రాజ్యవాదగర్భితవైరుద్ధ్యాలు. అవి ఏమిటో చూదాం

1. సామ్రాజ్యవాద దేశాలలో పాలన అంతయూ బ్యాంకర్లు అయిన ఏకొద్దిమంది ధనవంతులచేతిలోనో యిమిడి వుంటుంది. ఈ ధనమును పూర్తిగా మాతృభూమిలో పెట్టుబడి పెట్టుటకు వీలులేక, ముడిసామానులుండు చోటికి ఎగుమతిచేసి పెట్టుబడిపెట్టు అవుసరము కలుగుతుంది. ఈవిధంగా ప్రజలందరి జీవనం ఏ అరడజను బ్యాంకర్ల మీదనో ఆధారపడి వుంటుంది. అందుచే ప్రజలస్థితి క్రమముగా దుర్భరమై, కార్మికకర్షకులలో తీరని అశాంతి హెచ్చుచుండుట. ఇది రాష్ట్రాంతర్గతవర్గవైరుధ్యము.

2. సామ్రాజ్యవాదులు హెచ్చుగా ధనమును వలసరాజ్యాలలో పెట్టుబడి పెట్టటానికి ప్రయత్నిస్తారు. అందుచే వారికి కొల్లలాభము అమితం. వలసరాజ్యాలలో, ముడిపదార్ధాలు తీయించి, అచ్చటనే అతి తక్కువ కూలితో, వలసరాజ్య ప్రజలతో పనిచేయించుకొని అతి చవుకతో వస్తువులు తయారుచేయటానికి వీలవుతుంది. అందుచేతనే, వలసదేశాలమీద సామ్రాజ్యవాదులకు ప్రబలమైన వాంఛ. ఈవిధంగా మొదలిడి ప్రపంచాన్ని పంచుకున్నారు. ఈ దేశాలను పీల్చిపిప్పిచేస్తూంటేనేగాని అతిగా లాభాలు రావు. ఈలాభాలతో యుద్ధసామగ్రిని హెచ్చచేసుకోవచ్చు. కాని వలసరాజ్యాలలోని ప్రజల తీవ్ర అసమ్మతికి గురి అవుతారు. వీరిని అణచియుంచటం ఒకపని అవుతుంది.

ఇది సామ్రాజ్యవాదులకీ, వలసరాజ్యాలకీ వుండే వైరుధ్యము.

3. ప్రపంచాన్నంతా యీవిధంగా ఆర్థికంగా పంచుకొన్న తరువాత, వివిధ సామ్రాజ్యాధికారులకీ,ఎక్కువలాభాలు వస్తూంటేనే గానీ, ఇంటివద్ద తీవ్ర వేగముతో హెచ్చుతున్న నిరుద్యోగము, అశాంతి తగ్గించటానికి వీలుండదు. కొన్నిదేశాలలో ధనికవాదం త్వరగా వృద్ధిపొందటం, కొన్ని వెనుకబడటం మూలంగాను, యీ పరస్పర కక్షలు తప్పవు.

ఇదిసామ్రాజ్యవాద పరస్పర వైరుధ్యము

ఈ తీరని వైరుధ్యాలని చూచే, లెనిన్ మహాశయుడు, సామ్రాజ్యవాదారంభంతో, విప్లవశకం ఆరంభమయిందన్నాడు. పైవిషయాలనుబట్టి సామ్రాజ్యవాద నైజపరిణామం యుద్ధమని తేల్తోంది.

దీన్నిబట్టి, రాష్ట్రవర్గనిర్మాణాన్నిబట్టే, రాష్ట్ర విదేశాంగ రాజనీతికూడా వుంటుందని తేల్తుంది. అందుకని సోషలిస్టు సమాజంలో ఏలావుందో చూదాం.

(మిగతా 17 వ పేజీలో)



# అఖిల భారత కిసాన్ మహాసభ

## ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసం

గయలో యీ నెల 9, 10 వ తేదీలలో జరిగిన అఖిల భారత కిసాన్ మహాసభకు ఆహ్వాన సంఘ అధ్యక్షులయిన యదునందన శర్మగారిలా ఉపన్యసించారు.

సోదరులారా!

"దేశంలో ఎక్కడ చూచినా శాంతియుతమయిన పోరాటాలు అభివృద్ధి పొందుతున్నాయి. ఇప్పుడిక్కడ మీ ఎదుట నేను నిలబడి ఉన్నా, నామనస్సంతా వాటిమీదే ఉంది. ఈ పోరాటాల సందర్భంలోనే, జగద్విఖ్యాతి గాంచిన ఆర్త జనోద్ధారకులు, రాహుల్ సాంకృతాయన్‌గారు తన సహచరులతో (చాలామంది కర్షక సహచరులతో) చాప్రాలో ఖైదులో మ్రగ్గుతున్నారు. మా "సహాబాద్" సోదరులుకూడ చాలమంది ఇదే స్థితిలోనున్నారు. ఇటీవలనే సుమారు 200 మంది చంపరాన్ రైతులు రైతు సేవకులు ఖైదులోనుండి బయటికి వచ్చారు. కొన్ని సంవత్సరాలనుండి మా "దర్భాంగా" సోదరులకు ఊపిరి పీల్చుకొనే అవకాశమే లభించడములేదు. ఇక పాట్నా ముజఫర్‌పూర్ జిల్లాలలోని స్థితిగతులు వీటికి పూర్తిగా నకలే.

రైతులకు మంత్రివర్గము చేసిన సదుపాయాలను గురించి పదే పదే వారు చెపుతూ ఉంటారు. కాని జరిగిన విషయము ఒకటి వినండి. గయాజిల్లాలో ఈ ఏప్రిల్ నెలలో కూడ, తయారుగా ఉన్న ధాన్యము, సిద్ధాన్నము కళ్ళములలో అల్లాగే కుళ్ళిపోతోంది—తమ వాటా ధాన్యము తీసుకోడానికి జమీందారులు కదలి రారు. రైతుల వాటా రైతులను పట్టుకు వెళ్ళనీయరు. జమీందారుల కాఠిన్యము అల్లాగుంది. శాసనాలంత రీతిక్షనరీగా వున్నాయి. అధికారులంత నిర్లక్ష్యముగా వర్తిస్తున్నారు. దీనికి తగ్గట్టు గోరుచుట్టుపై రోకటిపోటువలె కాలమానము కూడా రైతులకు ఎదురు తిరిగింది. గత రెండుమాసాలలో చాలాసారులు వారాల తరబడి కుంభవర్షాలు అకాలముగా కురిసాయి దానితో కళ్ళములలో సిద్ధంగా ఉన్న ధాన్యమంతా నీట గలిసింది. మామిడి తోటల కాపు అంతా పాడు అయిపోయింది.

### కాంగ్రెస్సు—కర్షకులు

గడచిన మన జాతీయ ఉద్యమాల యొక్క స్వభావము ఎలాంటిదైనా, బ్రిటిషుప్రభుత్వముతో మనపోరాటము సంకులమైన కొలదీ, జమీందారులు, తదితర స్వప్రయోజనాభిలాషులు, ఒకొక్కరే చల్లగా వెనుకను జారిపోసాగారు. రైతులు మొదలగు పీడిత ప్రజాసామాన్యము ముందుకు వచ్చి పోరాట రంగములో నిలచి పోరాడజొచ్చారు. గత శాసనసభా ఎన్నికలల్లో ఇది స్పష్టమయింది. జమీందారులు, భాగ్యవంతులు కాంగ్రెసును బహిరంగముగా ఎదిరించి నిలబడినపుడు, దారిద్ర్యములో మునిగియున్న రైతులు, ప్రజాసామాన్యము కాంగ్రెసు పక్షాన నిలబడి జయాన్ని కాంగ్రెసుకిచ్చారు. దీనికి కారణములు కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికపై వారి విశ్వాసము, సత్యాగ్రహములో తామే కాంగ్రెసుకు బలమునిచ్చామనే అభిమానము, కాని తమ యొక్క కాంగ్రెసు యొక్క ప్రబల విరోధులయిన జమీందారులు, తృటికాలములో కాంగ్రెసుకు అసలు నాయకులవలె రొమ్ములువిరుచుకొని మీసాలు మెలిపెట్టి కిసానులను రూపుమాపివేయుటకు ముందుకు కాంగ్రెస్ హయాములోనే రావడం రైతులకు ఆశ్చర్యము, ఆగ్రహం కలిగించాయి. కొన్ని మంత్రివర్గాలు కొంత మేలు చేసినాయి. కాని దీనికి కారణము ఎన్నికల ప్రణాళికకు వారు చూపిన ఆదరము కాదు. జమీందారులు మైమరచి కావరముతో తప్పులు చేయడమువల్లనూ, శాసనసభలలో కాంగ్రెసు సభ్యుల అమిత సంఖ్య వారి కింకో దారి చిక్కనీయకపోవడమే దానికి కారణము.

### కాంగ్రెసు కర్తవ్యం

కాంగ్రెసు నూటికి 95 మంది ప్రజల విశ్వాసాన్ని అండను చూరగొని వారి సహాయంవల్లనే అధికారములోకివచ్చి ఆఖరి క్షణంలో తాను ప్రజలకు లాభం చేస్తానని వారికి గావించిన వాగ్దానాలను మరచిపోయి వారికి ప్రత్యక్ష విరోధంగా ఉన్నవారితో ఒడంబడికలకు దిగడం చాలా విచిత్రముగా కనుపిస్తోంది, నిజముగా జరుగుతోన్న విషయముకూడా ఇదే. కాంగ్రెసు జమీందారు ఒడంబడికల్లోనూ, కాంగ్రెసు—మిల్లు యజమానుల ఒడంబడికల్లోనూ మారుమ్రోగుతూన్న ముఖ్యాంశమిదే.

### దౌర్జన్యమని ఆరోపణలు

అహింస—అహింస అని వేళాపాళా లేకుండా హడావిడి చేయడం ప్రతివారికి ఒక ఫేషన్ అయిపోయింది. అడుగడుకీ దౌర్జన్యం సాగిస్తూ, ఎవరి ఉనికియే కేవలము దౌర్జన్యంపై ఆధారపడి ఉందో, వారే, ఈనాడు మనపై దౌర్జన్య నేరాన్ని ఆపాదిస్తూ "అహింసా" దూతలవలె ప్రగల్భాలు కొట్టుకోడం నగుబాట్లకు అశాంతికి కారణమవుతోంది. జమీందారీ, పెట్టుబడిదారీ విధానాల పునాదియే కేవలము "సంఘటిత దౌర్జన్యము" (Organised violence) వీటిని సమర్ధించే వారందరూ వచ్చి మనకు అహింసను గురించి వరవడులు పెట్టడానికి సాహసిస్తూ ఉన్నారు. ఇటువంటి హింసలను చూచి సహించడమేకాకుండా, దానికి మద్దతు ఇస్తూ, పైగా నిరాయుధులై, నిస్సహాయులైన సాధు కర్షకావళిపై లాఠీ చార్జీలను, తుపాకి కాల్పులను గావించమని ఆర్డర్లిస్తూ, ఇండియన్ పీనల్‌కోడ్‌లో సహితం అంగీకరింపబడిన ఆత్మరక్షణ అవకాశాన్ని అహింస పేరుతో మనకు రద్దుచేస్తూన్న వారి చర్యలు మాటలు హాస్యాస్పదముగాలేవా?

### బాధ్యత లేనివాళ్ళమని అంటారు?

"కిసాన్ సభ నాయకవర్గము విచిత్రముగా ఏమీ బాధ్యత లేకుండా వర్తిస్తోంది" అని ఒక కాంగ్రెసు నాయకుడు వ్రాశాడు. అదిచదివేసరికి నామనసు చివుక్కుమంది. కాని తన ఆరోపణను సమర్ధించుకోడానికి ఆ మహానుభావుడు ఒక్క నిదర్శనాన్నైనా చూపలేకపోయినందుకు విచారించాలి.

గత సత్యాగ్రహ ఉద్యమ సమయములో కిసాన్‌సభ తన కార్యక్రమాన్నంతా నాటికి కట్టిపెట్టి సత్యాగ్రహ సమరములో పాల్గొనాలని తీర్మానించింది. రాజకీయ వ్యవహారాలలో కిసాన్‌సభ కాంగ్రెసును వ్యతిరేకించకూడదని మరియొక తీర్మానము కూడా చేసింది. ఇదిగాక గత శాసనసభ ఎన్నికలలో కాంగ్రెసుపక్షాన అభ్యర్ధులుగా కాంగ్రెసుచే నిలబెట్టబడిన కరోడ్పతులవు జమీందారులను సహితము బహిరంగముగా బలపరిచింది కిసాన్‌సభ. 1937 వ సంవత్సరపు వేసంగిలో గయా జిల్లాలో నియమత్‌పూరులో సమావేశమై అఖిల భారత కిసాన్ కమిటీ "కిసాన్ సేవకులు, కిసాన్ సభలు, కాంగ్రెసు ప్రాధమిక సూత్రాలకు భిన్నంగా ఉండే స్వల్ప పనులు కూడా గావించక, కాంగ్రెసు త్రివర్ణ పతాకము ప్రజల దృష్టిలో న్యూనతకు పాల్పడే పనులు లేమాత్రమూ చేయవలదని" ఒక తీర్మానము కూడా చేసింది. కిసాన్ సేవకులలో ఎవరి వర్తనను గురించియైన రిపోర్టు వచ్చినచో వారు అట్టి పని చేయకుండా అపుచేయించివేశాము. ఇవేనా "కిసాన్ సభ సేవకుల విచిత్రమగు బాధ్యతా రహితమైన చేతలు?" కిసాన్‌సభ సేవకులకు కూడా బాధ్యత, సవ్యాపసవ్యాలు తెలుసును. వారు వారి బాధ్యతలను గుర్తించే కిసాన్ సభ కార్యక్రమముతోనూ సంపూర్ణ స్వాతంత్ర్య పోరాట కార్యక్రమముతోనూ లీనమైన సరియగు నాయకత్వము క్రింద పని చేస్తున్నారు. ఈ రంగములోకి దిగవలసినదని ఎవరూ వారిని భ్రమపెట్టడము గాని బలవంతపెట్టడము గాని జరిగియుండలేదు. తమ కర్తవ్యమేమో వారికి బాగా తెలుసును. దానిని గురించి పెద్ద ధర్మోపదేశాలు ఇతరులు వారికి చేయనక్కరలేదు.

### మన కర్తవ్యం

కిసాన్ సభ కాంగ్రెసుయొక్క శాఖ అని, దానిని అలా చేయాలని ఆలోచించేవారంతా భ్రాంతిలో మునిగిపోతున్నారని నా అభిప్రాయం. "కిసాన్ సభ స్వతంత్రమైన రాజకీయ వర్గ సంస్థ. కాంగ్రెసును ప్రజాతంత్రంగావించడానికి అది స్వప్రయోజనాభిలాషులయిన ధనాధిపతుల పలుకుబడిలో పడకుండ కాపాడడానికి సర్వశక్తులూ వినియోగించి కృషిచేయడం తన కర్తవ్యమని కిసాన్ సభ భావిస్తుంది, అన్ని పరిస్థితుల్లోనూ కర్షకులు, కార్మికులు, యువజనులు, విద్యార్థులు, ఇతర మధ్య తరగతులు కలిసియున్న ఐక్య సంఘటన ఏర్పాటు అగుటకు పూర్తిగా దోహదమిస్తుంది.

ఏ ఇతర సంస్థతోనూ పోటీ పెట్టుకోడానికి కిసాన్ సభ ఏర్పడలేదు. ప్రజల దాస్యవిమోచన కోసము పోరాడే సంస్థలన్నిటితోనూ సహకారము చేయడానికి రైతులను అందుకు తయారుచేయడానికి పని చేయడమే దానియొక్క నిజమైన ఆశయం. అందుచే బ్రిటిషు సామ్రాజ్యవాదముతో కాంగ్రెసు సాగించే పోరాటములోను అందుకై కాంగ్రెసు చేసే ప్రయత్నంలోనూ త్రికరణశుద్ధిగా దానితో సర్వదా సహకారం చేస్తుంది.

మేము దేశములోని వివిధ శక్తులు ఏ విధముగానైనను నాశనము కావడం ఒక రాజకీయ నేరంగా ఒక వంక పరిగణిస్తాము, రాజకీయాలలో గురుపీఠ సిద్ధాంతాన్ని ఏ మాత్రము సహింపజాలం. (మిగతా 16 వ పేజీలో)

# అఖిలభారత రైతు సంఘ సమావేశము

## ఆచార్య నరేంద్రదేవ్ గారి అధ్యక్షోపన్యాసము

[తేలికగా అచ్చొత్తిన పటముల వివరణ. 1. (ఎడమ ప్రక్కపైన): ఆచార్య రంగా, ఇందులాల్ యాజ్ఞిక్, బయ్యాజీ కులకర్ణి. 2. (ఎడమ ప్రక్క-క్రింద): సరిహద్దు రైతుల సమావేశం. 3. (మధ్య) స్వామీ సహజానంద, (కుడిప్రక్క క్రింద): త్రిపురీలో రైతు సమావేశం.]

గయలో జరిగిన అఖిలభారత కిసాన్ మహాసభలో ఆచార్య నరేంద్రదేవుగారు తమ అధ్యక్షోపన్యాసములో ఇలా ప్రసంగించారు.

సోదరులారా!

భారతదేశములో వ్యవసాయక సమస్య కడు క్లిష్టమైనది. ఇది నానాటికి బ్రహ్మాండమైన స్వరూపాన్ని పొందుతూఉంది. ప్రజాసామాన్యమంతా ముందుకు సాగిపోతున్నారు. తమతమ హక్కుల సంపాదనకై గొప్ప పోరాటాలను సాగిస్తున్నారు. తమ చేతులలోఉన్న అధికారాలన్నీ పోతున్నాయని గమనించి, వాటి నేవిధముగానైనా నిలుపుకోవాలని జమీందారులంతా తుది ప్రయత్నాలను పట్టుదలగా చేస్తున్నారు. అందుచేతనే వారి దౌష్ట్యము శతగుణీతమైంది. రైతులీనాడు అనేక కష్టాలకు పాల్పడి ఉన్నారు. ఈస్థితిలో మన సంఘంవారిని కాపాడుతూ అడుగడుగునకు వారికి బాసటయై నిలచి, వారిని నడిపించాలి, లేకుంటే సమజోడాలుకాని యీ పోరాటంలో వారు కృంగిపోవచ్చును.

రైతు పోరాటాల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడనున్న "గయ"లో మనం నేడు సమావేశమవడము ముదావహం. రియోరా రైతులు తమ ఆర్థిక హక్కులకై శౌర్యముతో పోరాడారు. ఒకవంక నుండి అనేకవిధాల విరోధులు తమను వెన్నుగొట్టుతున్నా రియోరా రైతులు శిక్షణతో స్థితప్రజ్ఞులవలె పోరాడారు. సహన శక్తికి త్యాగానికి భారతీయ రైతులది పెట్టింది పేరు. అతని ఓరిమి అసమానము. అతని శారీరక ఆర్థిక స్థితిగతులు వర్ణనాతీతములు. తరతరాలనుండి అతడు ఎన్నో బాధలకు లోనై యున్నాడు. సమాజములోని భూస్వామి, వడ్డీ వ్యాపారి, వర్తకుడు, మతకర్త, ఉద్యోగి, మొదలగు వర్గాల భారాన్నంతా రైతే కిమ్మనకుండానే భరిస్తున్నాడు. ఈపీడ దుస్సహమైనపుడే అతడు ప్రళయాగ్నివలె చెలరేగుతున్నాడు.

ఇటువంటి తిరుగుబాటులు రైతుచరిత్రలో [illegible] వున్నాయి. ఇవిరైతునుమరిన్ని బాధలకు మరింత పీడనకు పాల్పడచేశాయి. దేశవ్యాపక [illegible] తిరుగుబాట్లు బహుస్వల్పంగానే జరిగాయి. జరిగినవికూడా ఓడిపోవడమో లేకుంటే ప్రభుత్వము వెతల రైతుకు విశ్వాసాన్ని పురికొల్పడానికి సరిపోయేలాగున కొద్ది ఇబ్బందుల నివారణతో ముగియుటమో, సంభవించింది. ఫ్రెంచి విప్లవంలో రైతు, పట్టణ మధ్యతరగతులకు అండగానిలచి, భూస్వామ్య (జమీందారీ) విధానాన్ని రూపుమాపడానికి సాయపడ్డాడు. కాని కడకు ఆరైతుకు మాత్రం పూర్తిగా అపకారమే అందుకు ప్రతిఫలమైంది. జమీందారుల దాస్యపు సంకెళ్లలోనుండి రైతు బయటపడ్డాడు. జమీందారు కొలువుకు బదులు, యథేచ్ఛగా తన రెక్కలను పరులకు అమ్ముకొనే స్వాతంత్ర్యాన్నే పొందగలిగాడు. కొత్తగా వచ్చిన పెట్టుబడిదారీవిధానము తనకు కూలీల సప్లయికొరకు అతనికిట్టి స్వాతంత్ర్యాన్నివ్వక తప్పిందికాదు.

యుద్ధానంతరం, రష్యా విప్లవం వచ్చిన తర్వాత, రైతుకు క్రొత్తయుగం ప్రారంభమయింది. దానితో యూరపులో పరిస్థితులు మారిపోయినవి. జర్మనీ యుద్ధంతో తూర్పుదేశాలలో కూడ మార్పు వచ్చింది. రైతులు ధనవంతుల నాయకత్వంమీద ఆధారపడకుండా, కాంగ్రెసు [illegible]మీద ఆధారపడ్డారు.

### ప్రపంచ దుస్థితి.

1929లో ప్రపంచమంతటా ఆర్థిక మాంద్యము వచ్చినది. సామ్రాజ్యదేశాలు తమ భారమంతా వలసలమీద వేశాయి. మధ్యతరగతి ప్రజలు, చిన్న రైతులు నాశనంపొందేరు. రైతులలోని అసంతృప్తి తిరుగుబాటుగా ప్రతిఫలించింది. ఆర్థిక మాంద్యము రైతు ఉద్యమం మీదచక్కగా పనిచేసింది. రైతు ఉద్యమాలు మద్రాసులోను బెంగాలులోను అభివృద్ధి పొందాయి. శిస్తులు, పన్నులు తగ్గించాలని, రుణాలు తగ్గించాలని కోరికలు హెచ్చాయి. వోటుచేసే హక్కు దొరకగానే కొంత బలం చేకూరింది. ఎన్నికలలో రైతులలో స్వాతంత్ర్యకాంక్ష రేగింది. రైతుల కోరికలు ఎన్నికల ప్రణాళికలలో వేసిన కాంగ్రెసునేవారు బలపరచారు. కాంగ్రెసు జనసామాన్యానికి అండగా నిల్చి, వారికి చేసిన సేవవలన సులభముగా వారి విశ్వాసము చూఱగొన గల్గెను. కాంగ్రెసు, జనసామాన్యంలో ఆర్థికపోరాటాలు జయప్రదంగా నడిపింది. జనులలో నూతన చైతన్యం కలిగింది.

### క్రొత్త ఆశయాలు.

రష్యను విప్లవంతో వ్యవసాయదారులున్న దేశము లన్నింటిలోను మార్పువచ్చింది. రష్యను విప్లవము రైతుల ఆలోచనా పద్ధతిలోనే విప్లవం తెచ్చింది. సమాజంలో ఇట్టి అభివృద్ధి రావాలంటే అందులోని పురాతన సాంప్రదాయాలన్నీ ఛిన్నాభిన్నంకావాలి. ప్రజలలో అనాదినుంచి పాతుకొని పోయివున్న తీవ్ర అశాంతి వారిని అంధకారంలోనుండి మత్తునువదల్చి స్వేచ్ఛాన్వేషణకై బయటికి తెచ్చింది. రైతులలోకూడ మార్పుకోసం ఇట్టి తృష్ణయే వ్యాపించి ఉంది.

రైతులకు నిష్పాక్షికంగా సహాయంచేయడానికి కాంగ్రెసు మంత్రివర్గాలుకూడ కృషిచేస్తున్నాయి. ప్రజలలో వ్యాప్తమైయున్న వెలుగు, కాంగ్రెసుపై ప్రజలకున్న విశ్వాసం, వారి కృషిని మరింత సులభసాధ్యం చేస్తాయి. మంత్రులు మట్టుకు యీ వ్యవహారంలో శాస్త్రయుక్తంగా మాత్రం ప్రవర్తించుకొంటే పని అంతా తేలికగా తేలిపోతుంది.

జనసామాన్యం పడే బాధలవలన క్రొత్త అభిప్రాయాలు వచ్చాయి. భూమి అంటే శిస్తు తెచ్చే సాధనగాగాక, కార్మికులకు, పౌరులకు వృత్తియిచ్చే వస్తువుగా గుర్తించేరు. రైతుభావాలలో పెద్ద తిరుగుబాటు కలిగింది. తాను ముందునుండి సేవ చేసినవారిని విమర్శిస్తూ వచ్చినాడు. తాను ఆచారరీత్యా అవలంబించిన విధేయతకంటె విశిష్టమైన క్రొత్త ఆశ, క్రొత్త ఉత్సాహము అతనికి కన్పించినవి. ఇది పురస్కరించుకొని వినియోగించుకొంటే, రైతులను దేశంలో అప్రతిమాన శక్తిమంతులవలె తయారు చేయవచ్చును. క్రమశిక్షలోని సుగుణము వారికి తెలిపి, దౌర్జన్యము లేకుండా కట్టుగా పని చేయుట వారికి నేర్పవలెను. రైతులకు ఇట్టి అసంతృప్తి కలిగి ఒక ప్రబోధము తోచినపుడు ఒక నిశ్చయమునకు వచ్చుట వారికి కష్టము కాదు.

ప్రజలకు సదుపాయాలు కలిగించడానికి కాంగ్రెసు మంత్రులకున్న అవకాశాలు బహుస్వల్పం. తన హద్దులను తాను తెలుసుకొని నడవడం బుద్ధిమంతుని లక్షణం. అందుచే కాంగ్రెసు ప్రభుత్వాలు కొద్ది కార్యక్రమాన్నే ఆలోచించి ప్లాను ప్రకారం అమలు జరుపడం ఉత్తమం. రైతుకీనాడు విజ్ఞానం అత్యవసరమైనది. అందుచే గ్రామ పునర్నిర్మాణాభివృద్ధికై గావింపబడే పనులలో విద్యావ్యాప్తికి ప్రధాన స్థానంఇవ్వాలి. ప్రజా సామాన్యంలో విద్యాభివృద్ధి అభివృద్ధికి మూలాధారము. గ్రామస్థులకు సమిష్టి కృషియొక్క ఆవశ్యకతను గూర్చి తెలియజేయాలి. వారిలో పరస్పర సహకార స్వభావం అలవడితే, రోడ్లు మరమ్మతు చేసుకోడం, నీటి సౌకర్యాలు వృద్ధిచేసుకోవడం, అంటువ్యాధుల నుండి గ్రామాలను కాపాడుకొని వైద్య సదుపాయాలు చేసుకుంటూ శాంతిని కాపాడుకో గలుగుతారు. కాని ఇవన్నీ జరుగాలంటే గ్రామాలకు నిజమైన స్వపరిపాలనాధికారాలు ఉండితీరాలి, గ్రామానికి పూర్వపు అధికారాలు కొన్ని తిరిగి సంక్రమించాలి.

### రాష్ట్రీయ స్వపరిపాలన

కృంగిపోతూఉన్న రైతాంగాన్ని ఉద్ధరించడానికి రాష్ట్రాలలోనున్న వేర్వేరు ప్రభుత్వాలు శాసనాలు తీసుకు వస్తున్నాయి. కాని [illegible] అవసరమైనంత అనువుగా అవిలేవు. ప్రస్తుతం ఉన్నరాజ్యాంగ విధానపు హద్దులలో ఇంకా ఎక్కువగా చేసేటందుకు వీలుగలదు ఉన్న స్వల్ప అవకాశములోను చేయగల్గినది అనతి కాలంలోనే పూర్తిచేస్తారు, కాని ఏమీకారణం లేకుండానే వ్యవసాయక సంస్కరణలు తీసుకు రావడానికి చాలా ఆలస్యం జరుగుతూ ఉండడం చాలా విషాదకరమైన విషయం. నడకఅంతా చాలా మందంగావుంది. కాంగ్రెసు ప్రభుత్వాలకు ప్రజల అండ ఎక్కువగా ఉన్నప్పటికీ కొన్ని రాష్ట్రాలలో ఎందుచేతనో భాగ్యవంతులతో రాజీపడదామనే ఆశ, వారికి జడిసి చురుకుగా ముందు పోవడానికి వెరపుఉన్నట్లు రూఢియైన నిదర్శనాలు కనుపిస్తూనే ఉన్నాయి ఇంతవరకు జరిగిన శాసనాలన్నీ రైతులకు తాత్కాలిక సదుపాయం కోసమే జరిగాయి. అవి సాంఘిక వ్యవస్థలో తీవ్రమైన మార్పుల నేమీ సూచించడమేలేదు. అయినప్పటికీ జమీందారులంతా ఏదోపుట్టి మునిగిపోయినట్లు, విప్లవకరమైన మార్పులు తీసుకు రాబడుతున్నాయని గగ్గోలు పెట్టుతున్నారు. ప్రస్తుతమున్న ఆర్థికదుస్థితి యొక్క తీవ్రతను గమనించినచో రైతులకు మేలుచేయాలంటే పరిపూర్ణమైన మార్పులను గావించితీరాలి.

రైతులమీద మరీ అన్యాయంగా కనుపిస్తున్నభారాన్ని కొంత తగ్గించడంకోసం మాత్రమే యీనాడు కాంగ్రెసు ప్రభుత్వాలు కృషిచేస్తున్నాయి. తాత్కాలికంగా ఉపశమనం రైతుకు గలిగినా, మళ్లీ ఊపిరిపీల్చుకొనే లోపుగానే మిగతాభారాలన్నీ అతనిని చుట్టుముట్టి ఊపిరి సలపనీయడం లేదు. ఈ ఆవేదనలో వీటి భారాన్నికూడా తొలగించవలసినదని మొరబెట్టుతున్నాడు. ఏమైనను ఇక ముందెన్నడూకూడ రైతులు భూస్వాములవైపు చూడరని వారిని అనుసరింరని మాత్రము నిర్వివాదాంశము.

### కాంగ్రెసు - రైతాంగం

విప్లవకరమైన మార్పులను తీసుకురావడానికి ప్రస్తుతమున్న రాజ్యాంగవిధానంలో అవకాశం లేక కాంగ్రెసు ప్రభుత్వాలు ఇబ్బంది పడుతున్నమాట వాస్తవమే. అయినా ప్రజలకు సాధ్యమైనంత ఎక్కువ సదుపాయాన్ని చేకూర్చేటందుకు ఉన్న అవకాశాలన్నీ పూర్తిగా వినియోగించి తీరుతారని మంత్రులనుండి మనం ఆశించాం.

మనమంత్రులలో చాలమంది కిసాను సంఘాలను, ప్రచారకులను అనుమానంతోను చూస్తున్నారు. రైతు సేవకుడంటే నమ్మకమే లేదు. కాంగ్రెసువాదులు, చేసిన విమర్శలను సరిగా గ్రహించుట లేదు. స్నేహపూర్వకముగా చేసిన విమర్శలను కూడా అన్యథా భావిస్తున్నారు. ప్రజలకు బాధ్యత వహించే ప్రభుత్వము విమర్శనలను నిరసించడానికి బదులు అవి కావాలని కోరాలి. ఒకకోరిక బలవత్తరమై ఏదో ప్రత్యేక చర్య తెస్తామని భయపెట్టేవరకు ఆగకూడదు. కాంగ్రెసు మంత్రులు ప్రజాదరణకు పాత్రులయ్యేటట్లు చూడాలి. కాంగ్రెసు ఉండగా రైతులకు వేరే సంస్థ ఎందులకు అని చాలాచోట్ల నుండి ప్రశ్నలు వస్తున్నాయి దానికొకటే సమాధానం కాంగ్రెసు వివిధ వర్గాలతో నిండిన సంస్థ అవడంవల్ల, ఆ జాతీయ సంస్థలో తన మాటను రైతు పూర్తిగా చెల్లుబడి చేసుకోలేక పోతున్నాడు ఇతరవర్గాలపట్ల తన వైఖరిని స్వేచ్ఛగా వెల్లడించుకునే అవకాశం అందు అతనికి లేదు. మిగిలిన వారి సమ్మర్ధంలో అనామకుడైపోతున్నాడు, రైతు తనయొక్క సంకోచమును వదలి నిక్కచ్చిగా తన దృక్పథాన్ని వెల్లడించి చెల్లుబాటు చేసుకోగల శక్తిని రైతుకివ్వడానికే అతనికి తన వర్గసంస్థద్వారా శిక్షణ యివ్వడం అత్యంతవసరం,

కాంగ్రెసు జాతీయ సంస్థయైనా, రైతుల ప్రాథమిక హక్కులు విపరీత పరిస్థితులకు వస్తేనేగాని గుర్తించుటలేదు. దేశములోని దుర్భిక్ష అంతా ఇక్కడనుండ విదేశాలకు పోయే ధనప్రవాహంవలన వచ్చింది, కాని దేశములోని ఆర్థికస్థితివలన కాదని అంటున్నారు. అందుచే రైతులయొక్క కోర్కెలను ఎక్కువగా ఆమోదించునట్లు కాంగ్రెసుపై విప్లవకరమగు ఒత్తిడిని తీసుకురావడానికికూడా కిసాన్ సభ అత్యవసరమే. ఇదివరలో ఇట్టి ఒత్తిడి తీసుకురాబడింది. అది బాగా ఫలించింది. రైతుల మేలుకోసం పోరాడుతానని కాంగ్రెసు ఈనాడు ప్రమాణంచేసింది. దేశానికంతకి ప్రతినిధిని తానే అను కాంగ్రెసు అత్యధిక సంఖ్యాకులైన నిరుపేదలతో దేశం నిండి ఉంటే ఇతరత్రా ఏమి చేయగలదు? దేశం మేలుకోసం పనిచేయాలని కాంగ్రెసే తలుస్తే, విదేశీయ, స్వదేశీయ, జమీందారీల దోపిడీల పునాదినంతా నిర్మూలనం చేసితీరాలి.

ప్రజలు తమ సంఘాలనాయకుల ద్వారా విన్నవించుకొనే మొరలను ఓరిమితో సాదరంగా ఆలకించి, వాటిని నెరవేర్చుటకు మంత్రులు ఎక్కువ బాధ్యత వహించాలి. అంతేగాని రైతు ఉద్యమాన్ని విరోధ భావంతో నిర్లక్ష్యంగా పరిగణింపరాదు. రైతులు పేర్కొనిచూపిన దుర్వర్తనలను, లోపాలను ఆపుచేసి, వారు భరింపజాలని బాధలను నివారణ చేసినచో రైతులు ప్రత్యక్ష పోరాటానికి దిగవలసిన అగత్యము వారికుండదు. గ్రామంలో నుండే షాహుకార్ల, వడ్డీ వ్యాపారస్తుల బాధలనుండి రైతాంగాన్ని రక్షించడానికి కొన్నిపనులు శాసన రూపంగా చేయాలి. గ్రామస్థుల ఋణభారాన్ని గురించి పరిశీలించి దానిని పూర్తిగా రద్దుచేయాలి. కనీసం చాలావరకు తగ్గిపోయేటట్లయినా చేయాలి. అంతటితో చాలదు. చవుకరేట్లతో పెట్టుబడులు అప్పులు పుట్టే సదుపాయాలను రైతాంగానికి కల్పించాలి. రైతులు కష్టపడి పండించిన ఫలసాయాన్ని విక్రయించుటలో మధ్యవాళ్ళు లాభాలక్రింద తినివేయుటను ఆపుచేయడానికి విక్రయ సదుపాయాలను ఏర్పాటు గావించాలి, సహాయక పరిశ్రమల నభివృద్ధిచేసి భూమిని బాగుచేయడానికి పరిపూర్ణమైన అవకాశాలను రైతుకు కల్పించాలి. ఇంతేకాదు. రైతుకు ప్రభుత్వముయొక్క సంపూర్ణమైన సహాయము, ప్రోత్సాహము ఇచ్చి వ్యవసాయక వ్యవహారాలలో అభివృద్ధికరమగు విధానమును మంత్రివర్గాలు అవలంబించాలి

### రైతు సంఘాల అవసరం.

"కాంగ్రెసు సభ్యులే చాలాభాగం రైతులు గదా? కాంగ్రెసు తన ఫెయిజ్‌పూర్ వ్యవసాయక ప్రణాళికలోను, కరాచీ, ఆర్థిక హక్కుల తీర్మానములోనూ వ్యవసాయదారుల కోర్కెలను చాలావరకు అమోదించి యున్నప్పుడు వేరే రైతు సంఘాలెందుకు" అని చాలామంది ప్రశ్నిస్తున్నారు.

వివిధరాష్ట్రాలలో కాంగ్రెసు సంస్థ విచ్ఛిన్నంగా ఉన్నది కాబట్టి, రైతులకు సరియైన క్షేమం జరుగక పోవచ్చు. అట్టి చోట్ల రైతు సంఘాలు చాల ఉపకరిస్తవి. రైతులయెడ ఇపుడు కాంగ్రెసు చూపే శ్రద్ధ, అధికారం పోయింతర్వాత ఉంటుందో లేదో చెప్పలేము. ఈ కారణంచేతనే కిసాను సంఘములు ఉండవలసివస్తూవున్నది, రైతులకు, రైతుసంఘాలకు కాంగ్రెసుకు గల భేదాలు తెలియక పోయినా, రైతుసంఘాలు కాంగ్రెసు అంటే కిట్టనివారు లేవదీసి పోటీగా నడిపి, అంతటా అలజడి గల్లంతుచేసే సంస్థలుగా కన్పట్టవచ్చును. అట్టిది అక్కరలేకుండా, ఈసంస్థ లేర్పడి కాంగ్రెసు కమిటీలతో సహాయకారిగా పనిచేయవచ్చును. కాంగ్రెసుకమిటీల సహాయం కోరి పనిచేసినా, రైతుసంఘాలకు తగినంత ప్రత్యుపకారం లభించనపుడు వారుస్వతంత్రంగా పని చేయక తప్పదు.

### కాంగ్రెసు - రైతుసంఘాలు

రైతులు ప్రత్యేకంగా వేరేసంఘంలో ఉండవలసిన ఆవశ్యకత నిర్ధారణ అయిపోయింది. యీ రైతుసంఘాలు స్థానిక కాంగ్రెసు సంఘాలతో సాధ్యమైనంతవరకు మైత్రితో వర్తించడం, వాటిసహకారంతో తమ కార్యక్రమాన్ని నిర్వర్తించు కోవడం వాని ప్రధానకర్తవ్యం. కాంగ్రెసు కమిటీలయొక్క సహాయం రైతు సంఘాలకెంతో ఉపయోగకరం. అందులోనూ ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసుచే రైతులవైఖరి అవలంబింప చేయుటకెంతో సహాయపడుతుంది. కాంగ్రెసు రైతులయొక్క బలంవల్లనే అధికారాన్ని స్వీకరించగలగడంవల్ల, రైతుల శ్రేయస్సును చూడవలసిన ప్రత్యేకబాధ్యత తనమీద పడడంవల్ల కాంగ్రెసు రైతు దృక్పథాన్ని కొంతవరకు అలవరచుకో గలిగిందని అనుభవంలో మనకు తెలుస్తూఉంది, "అయినా కాంగ్రెసుతో పోటీపెట్టుకోవాలనే కాంక్షమాత్రం రైతు సంఘాలకు పనికిరాదు. కాంగ్రెసుకంటెపైచేయి సంపాదించాలనే కాంక్షనుకూడ అరికట్టాలి. ఈ రెండుసంఘాలుపరస్పరసహాయకమైనవనిమనం మరిచిపోకూడదు. ఒకదాని సహాయం వల్ల రెండవది బలపడుతుంది. ఈ రెండు సంఘాలయొక్క పరస్పరసహాయక స్వభావాన్ని మనం సర్వదా దృష్టిలో నుంచుకొనకున్నచో విషాదకరమగు పొరబాట్లను మనం చేయవచ్చును. రైతుల ఆర్థిక హక్కులను సంపాదించుటకును వారి దినదిన ఆర్థికసమస్యలకై పోరాడుటకును రైతుసంఘాలను ప్రధానంగా ఏర్పరచాలి.

కాని. ఈనాడు రైతు బాధ నందుచున్న విదేశీయ పీడనుండి విముక్తి పొందాలంటే సంపూర్ణ స్వాతంత్ర్యం భారతదేశానికి సిద్ధించే వరకు అది సాధ్యంకాదు. భారతదేశము పరాధీనమై యున్నంతకాలము అతనికి రాజకీయ అధికారం రానేరాదు. అందుచే ఇతరవర్గాల సహకారంతో భారతదేశ స్వాతంత్ర్య ప్రాప్తికి రైతు కృషిచేయాలి. ఈనాడు కాంగ్రెసు మహాసభ జాతీయ స్వాతంత్ర్యానికి చిహ్నము. సామ్రాజ్య వ్యతిరేక పోరాటానికి సాధనము. అందుచే రైతు కాంగ్రెసును ప్రేమించేటట్లును అది తనదని అధికారంగా మాట్లాడేటట్లును అతనికి నేర్పాలి. అంతేగాని దానిపై సవతితల్లి వైఖరిని ప్రదర్శించరాదు. ఆర్థిక పోరాటాన్ని జాతీయ పోరాటంగా మార్చి, జాతీయ స్వాతంత్ర్య ఉద్యమానికి సాంఘికంగా కూడా పరిపూర్ణతను కలిగించాలన్నచో ఈ రెండు సంఘాలకు శాశ్వత సఖ్యతను చేకూర్చడం అత్యవసరం. అదిమన విధికూడ. పరస్పరాసూయలుఅనుమానాలు,మధ్యమధ్య సంభవించియీ సఖ్యతకు హాని చేస్తూఉంటాయి. ఉభయ పక్షాలలోనూ ఆవేశపూరితులు, ఒందొరులయొక్క ప్రాముఖ్యతను గుర్తించలేక కొన్ని తగాదాలను తీసుకొని రావచ్చును. ఒకరికి ఆవేశం కలిగించి చీలికలు కలిగించే పనిని ఇంకొకరు చేయడం తటస్థించవచ్చును. కాని మనం కొంత ఓపికపట్టి సమస్యను శాంతంగా పరిశీలించినచో అట్టి ఆవేశాలను సహించి, అవి వైషమ్యానికి కారణం కాకుండా చేసుకోగలుగుతాం. రైతు సంఘాలు శాశ్వతంగా ఉండేవేనని కాంగ్రెసు గ్రహించి, వాటితో సఖ్యత కలిగియుండి, ఆవి క్రమమైన పంథా ననుసరించునట్లు తాను చేయవలసినబాధ్యతను గుర్తించి వర్తించినచో తెలివైన పని చేసినదగును. జాతీయ సంస్థయని పేరు పొందిన సంస్థ, సామ్రాజ్యవాదమును వ్యతిరేకిస్తూ కాంగ్రెసుకు సుముఖంగానున్న రైతుల సంస్థను ఏమాత్రము విరోధభావంతో చూడడం భావ్యంగాదు.

"దేశం మొత్తంమీద ప్రజాపోరాటం లేనిదే కాంగ్రెసుకూడా తన ఆశయాన్ని పొందలేదు. స్వాతంత్ర్య స్థాపనకై ఎంతటి త్యాగానికి కష్టానికైనను సిద్ధంగా నుండే వర్గవిజ్ఞాన వంతులగు రైతుయోధుల సేవ, కాంగ్రెసుకు అత్యవసరము.

"అందుచే ఈరెండు సంఘాలు పరస్పర శ్రేయస్సును అభిలషిస్తూ. ఒకరిపని నింకొకరిచే పూర్తి చేయించుకొనుచు సఖ్యతతో వర్తించాలి.

### రైతు సమస్యలు,

రైతులలో పెద్దలకు, చిన్నలకు కలహాలు తేగూడదు. వ్యవసాయ కూలీలకు భూములు లేవంటే దానికి రైతులు కారకులు కారు. ఈ ఆకలి తీర్చడానికి ప్రభుత్వమే బాధ్యులు, రైతు ఆదాయం అభివృద్ధి కానంతవరకు 'కూలీ' మొత్తం ఏర్పాటుచేయుటకు వీలులేదు. రైతు బాగుపడి, ఎక్కువలాభంవస్తేనే హెచ్చు కూలీ ఈయగలడు. గ్రామస్థులంత వీరికి సహకారం చెయ్యాలి.

### వ్యవసాయ కూలీ సమస్య.

వ్యవసాయకూలీ రాజకీయోద్యమంలో చాల దుర్బలమైన స్థానంలో ఉన్నాడు ఇందు ఆతడు కూడకలుగజేసికోవాలని ఉంటుంది.అతడుకలుగజేసికొంటే రైతు ఉద్యమానికి ప్రతికూలము కాని నిర్ణయాలు కొన్ని చేయవచ్చును. ధనికరైతులవద్దనుండి, భూస్వాముల వద్దనుండి హెచ్చుజీతాలు రైతుసంఘా లిప్పించవచ్చును. రైతులు తమకు భూస్వాముల పెత్తనం పోవాలి అంటే గ్రామస్థులతో స్నేహంగా ఉండుట నేర్చుకోవాలి. భూమిలేని రైతులకు, రైతులకు కలహాలు రావచ్చును. అది తెలిసియే ప్రతికక్షులు భేదోపాయంచేత రైతులలో చీలికలు తెచ్చి పరిపాలించాలని చూస్తున్నారు. భూస్వాములు కాంగ్రెసు ప్రభుత్వాలను నిమ్నజాతులను, వ్యవసాయ కూలీలను నిరాదరణ చేస్తూ వున్నందుకు దెప్పిపొడుస్తున్నారు.

వ్యవసాయకూలీల ఆర్థికస్థితిని బాగుచేయాలనే ఉద్దేశంతో వారిలో సంచలనం కలుగచేయవచ్చును. వారికి రైతులకు పోటీకలిగితే రైతు ఉద్యమానికి ప్రతిబంధకం జరుగుతుంది. కూలీలకు, రైతులకు తీవ్రకలహం ప్రారంభమవుతుంది. ఫారమ్ పద్ధతిని వ్యవసాయంజరిగేచోట కూలీలు కలిసి హెచ్చుజీతాలు కోరవలసిందే, వ్యవసాయ కూలీలు ఆర్థికంగాను నైతికంగాను అభివృద్ధి పొందాలి.

### అఖిలభారత కార్యక్రమము.

మనదేశములో వ్యవసాయదారుల స్థితిగతులు ప్రతి రాష్ట్రంలోనూ వేరు వేరుగానున్నాయి. అందుచే ఒకే అఖిలభారత కార్యక్రమాన్ని ఏర్పాటుచేయడం దుర్లభం. అందుచే ముఖ్యమైన విషయాలను మాత్రం అఖిలభారత కార్యక్రమంలో చేర్చి స్థానిక పరిస్థితుల కనుకూలించే వేరువేరు కార్యక్రమాలను ఏర్పాటు చేసుకునే అవకాశాన్ని రాష్ట్రీయ సంఘాలకు వదిలివేయడం చాలా అవసరం.

ఆచార్య నరేంద్రదేవ్

జమీందారులు, రైతులు వేర్వేరు మతాలకు చెందిన కొన్ని ప్రాంతాలలో రైతుసంఘాలు మత స్వభావాన్ని వహించాయి. ఇది చాలా విచారకరమైన విషయం.

అట్టి రాష్ట్రాలలో కాంగ్రెసు రైతులను పూర్తిగా అశ్రద్ధచేయడం వల్లనే ఇట్టి భేదమునకు ఆస్కారం కలిగింది. వారిమధ్య నుండే మత ద్వేషాలవల్ల రెండు సంఘాల సమ్మేళనం అటుంచినను సహకారమే దుర్ఘటమైపోవుచున్నది. ఈ కారణంవల్ల అట్టి ప్రాంతాలలో రైతు ఉద్యమం ఎక్కువబలాన్ని సంపాదించగలిగి ఉన్నను జాతీయ పోరాటపు దృష్టిలో దీనిని గమనించినచో అది శుభావహము కాదు. ప్రస్తుతపు ఉద్యమాన్ని మత విభేదాలతో చీలదీయరాదు. యీ స్థితిని మార్చాలంటే కోపం అసహనం ప్రకటించడం ద్వారా గాక, స్వార్థరహిత సేవ ద్వారా, రైతు సేవకులు ప్రజల విశ్వాసాన్ని సంపాదించాలి. రైతులతో వారు ఐక్యమయి పోయేకొలది వారు తమ ఆశయాన్ని నెరవేర్చుకో గలుగుతారు.

మరికొన్ని ప్రాంతాలలో కాంగ్రెసుకమిటీలు, వర్తకులు, వడ్డీ వ్యాపారస్తుల స్వాధీనంలో ఉండడంవల్ల వారి లాభాలకు గ్రామప్రజల లాభాలకు స్పర్ధ సంభవించడంవల్ల, రైతులలాభాలను వారు కాపాడతారనుకోడానికి వీలులేదు. అందుచే పట్టణప్రాంతాలకు, గ్రామ పరిసరాలకు స్పర్ధ సంభవించి గ్రామ ప్రజలపై కాంగ్రెసు కిసుమంత పలుకుబడికూడా లేక పోయింది. రైతులయొక్క స్థితిచాలా దుర్భరంగా ఉండడం వల్ల వారు ఈ స్థితిలో కాంగ్రెసునుండి విడిపోయి తమ హక్కులకై పోరాడే వేరొక సంస్థను ఏర్పాటుచేసుకొనవలసివచ్చినది. ఈ పరిస్థితులలో కాంగ్రెసుకు రైతుసంఘాలకు మధ్య పరస్పర ద్వేష మేమాత్రము పనికిరాదు.

ఇటీవల కొంతకాలమునుండి యీ రెండు సంఘాలమధ్య అన్యోన్యత హెచ్చి పూర్వపు స్పర్ధ అంతరించుచుడుట మన అదృష్టము.

### రైతు ఉద్యమ ప్రచారం.

రైతు ఉద్యమం, ప్రజాస్వామికతను కోరుతుంది. ప్రపంచ శాంతిని యుద్ధనాశనమును కోరును. కార్మికులకు తగిన రక్షణ నిచ్చును. దేశపు రాజకీయ విముక్తికి యీ సంఘం పని చేయాలి.

తర్వాత నరేంద్రదేవ్‌గారు 1936 నుండి కిసానుసంఘం చేస్తూఉన్న సేవను ఉగ్గడించేరు.

### ఆంధ్ర రైతు సంఘం.

ఆంధ్రరైతులు గొప్ప రాజకీయ ప్రబోధం కలిగించేర (మిగతా 15 వ పేజీలో)

# అఖిలభారత రైతు సంఘ తీర్మానాలు

1. సంయుక్త పరగణాలు, బీహార్, బెంగాల్, ఆంధ్ర గుజరాత్, మార్వార్, తిరువాన్కూరు, ఒరిస్సా మొదలగు రాష్ట్రాలలోను, ఆయా సంస్థానాలలోనూ, వేర్వేరు రైతు పోరాటాలలో పాల్గొనుటకు ధైర్యముతో ముందుకు వచ్చిన రైతు స్త్రీపురుషులకు స్వాగతమిచ్చుచు, అందు నిర్బంధములకు పాల్పడిన స్త్రీ పురుష వీరులకు యీ సభవారు తలయొగ్గి ప్రణతులర్పించుచున్నారు.

నేషనల్ డిమాండుపై తీర్మానము

2. భారత దేశమందలి రైతాంగంలో కలిగినచైతన్యానికి సంతృప్తిని వెల్లడించుచున్నది. "రాష్ట్రీయ స్వాతంత్ర్యములోని బూటకత్వము" తేటతెల్లమయినదని ప్రకటించుచున్నది. దేశమందలి రైతాంగబలముతో గలిగిన భారతదేశమందలి ప్రధాన రాజకీయసంస్థయగు కాంగ్రెసు మహాసభయొక్క అధికారము ప్రతిష్ఠ అన్ని మూలలకు వ్యాపించినందులకు ఆనందమునువెలిబుచ్చుచున్నది త్రిపురీకాంగ్రెసు తీర్మానానుసారం దేశాన్ని స్వాతంత్ర్యపోరాటానికి తయారు చేయడంలో సంపూర్ణ సహకారాన్ని కాంగ్రెసు మహాసభకు గావింప సిద్ధముగా నున్నామని వాగ్దానమును గావించుచున్నది. త్వరలోనే అట్టి కార్యక్రమమును ఆచరణలోకి తీసుకొని వచ్చు

కామ్రేడ్ చలసాని వాసుదేవరావు

అఖిలభారత రైతు సంఘ సంయుక్త కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

టకు. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమును, అఖిలభారత కాంగ్రెసు కమిటీయున్ను వచ్చే సమావేశములోనే నిర్ణయింతురని యీ సభవారు ఆశించుచున్నారు.

• సంపూర్ణ స్వాతంత్ర్యముకొరకు పోరాటమును సాగించునప్పుడు కావలసిన యావద్భారతీయ ఐకమత్యమును పైవర్గాలు భగ్నంచేయకుండా ఉండుటకును, కిసాన్‌సభ మనసారవాంఛించుచున్న కాంగ్రెసు-కిసాన్ సభల ఐక్యసంఘటనము దృఢముగా ఏర్పాటుచేయుటకును, త్రికరణశుద్ధిగా ప్రయత్నములు జరుగగలవనియు ఆచరణలో కాంగ్రెసే అట్టి ఐక్యసంఘటనగా నిర్మాణము కావాలనియు యీ సభవారు కోరుచున్నారు.

ప్రస్తుత అంతర్జాతీయ క్లిష్ట పరిస్థితులు తదితర అవకాశాలు చాలా వీలుగా నుండుటచే ప్రస్తుత బానిస రాజ్యాంగ విధానముపై దాడిపెట్టుటకు మంచి తరుణమాసన్నమైనదని వివరించుచు కిసాన్‌సభ అవలంభించుటకు కార్యక్రమమును తయారుగావించారు.

3. ఎన్నికలలో గావించిన వాగ్దానాలను నిర్లక్ష్యము గావించినందులకు బీహారు మంత్రివర్గాన్ని నిరశించుచు, బీహారులో కాంగ్రెసు, జమీందారు ఒడంబడికవలన కాంగ్రెసుమంత్రి వర్గముపై రైతాంగమునకు విశ్వాసం పోయియుండుటచే ఆ ఒడంబడికను రద్దుచేసుకొని ఎన్నికల వాగ్దానాలను అమలు జరుపవలసినదని బీహారు మంత్రివర్గాన్ని హెచ్చరిస్తూ తీర్మానము గావించబడినది.

4. (1) మధ్యపరగణాలలోని కాంగ్రెసుప్రభుత్వమునకు మాల్‌గుజారీ, శిస్తు, రెవెన్యూ విధానములలో తీవ్రమైన మార్పులను తీసుకొని రావలసినదనికోరుతూ అనేక జిల్లాలలో స్థానిక కాంగ్రెసు కమిటీలు, కిసాన్‌సభలయాజమాన్యాన అనేకసభలు జరిగాయి. అవి చేసిన అనేకతీర్మానములు మాటిమాటికి పంపినను, ఆప్రభుత్వము ఆవిధానములలో ఏమాత్రము కూడా అభివృద్ధికరమగు మార్పులను గావించుటకు నిరాకరించ చున్నందులకును. (2) మధ్యపరగణాలు, బీరారు రాష్ట్రములలోని జమీందారీ, రైతువారీ భూములలో పంటలు విస్తారముగా పాడవగా, పన్నులు రెమిషన్ ఇప్పించ వలసినదని కిసాన్ సభలు మొరపెట్టినను, కాంగ్రెస్‌వాదులు కాంగ్రెస్ కమిటీలు ఇవే సూచనలను తిరిగి తిరిగి గావించినను, రెమిషన్ ఏర్పాట్లు నిరాకరించడంలో ఆ మంత్రివర్గము పూర్వపు నిరంకుశ ప్రభుత్వాల, నిర్లక్ష్యభావాన్నే ప్రదర్శించు చున్నందులకును (3) శిస్తులను పన్నులను బలిమిచే రాబట్టుటకు భూములను, పశువులు ధాన్యము మొదలగు రైతు కుటుంబ జీవితానికి అవసరమగు ఇతర చరాస్తులను, జప్తుచేయుట, వేలము వేయుట మొదలగు దుర్భర నిర్బంధ విధానము నవలంబించు చున్నందులకును, యీసభవారు తమ విచారమును వెలిబుచ్చు చున్నారు.

పంటల ప్లానింగుపై తీర్మానం

5. భోజనసామగ్రి, పశుగ్రాసము మొదలగు వాటిని పండించుటను తగ్గించి, వర్తకపు పంటలను ఎగుమతుల కొరకై పండించుచు భారత దేశమందలి రైతాంగం ఇప్పటివలెనే ప్రపంచ వర్తకముమీదనే ఆధారపడి వాటిస్థితిగతుల ఒడుదుడుకులలో పడకుండా ఆపుటకు వివిధరాష్ట్ర ప్రభుత్వాలతోను, సంస్థాన ప్రభుత్వాలతోను సంప్రదించి, వివిధప్రాంతాలలో పండేపంటలను ఒకప్లాన్ ప్రకారం పండించుటకు వీలగు ఏర్పాటులను చేయవలసినదని యీసభవారు కేంద్ర ప్రభుత్వమును కోరుచున్నారు. ముఖ్యముగా జనుము, గోగునారలు, వరి, చెరకు, ప్రత్తి వేరుశనగ, పంటలను పండించే రైతులు ధరలు మాంద్యమువలననో లేకపరస్పరపోటీవల్లనో లేక అమితఉత్పత్తి వలననో, నష్టము పొందుతూ ఉన్నారు అందుచే ఇతర పంటలలోను, ముఖ్యముగా పైన పేర్కొనబడిన పంటలలోను అభివృద్ధికరముగానుండునట్లు వంతుల (టరను) ప్రకారం మార్పులను గావించుటకు తగు ఏర్పాట్లుగావించుట చాలా అవసరమని యీ సభవారు కేంద్రప్రభుత్వమునకు తెలియజేయుచున్నారు.

6. అఖిలభారతచేర్‌డ్ యూనియను కాంగ్రెసువారికి యీసభవారు తమసోదర అభినందనా ... కార్మిక ... వారి బానిసటయై నిలువ నున్నామని యీ సభవారు వాగ్దానము గావించుచున్నారు.

కార్మిక కర్షకుల ఐక్యపోరాటము ద్వారనే పీడిత మానవలోకముయొక్క సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం, పెంపొంద గలదనియు, తుదకు కార్మిక కర్షక రాజ్యస్థాపన ద్వారా, దోపిడీ విధానం కూడ అంతమొంద గలదనియు యీసభవారు విశ్వశించుచున్నారు.

8. కార్మికులు, కర్షకులు, తమతమ పోరాటములలో ఒకరికొకరు, సహాయమును గావించుకొనుచు, మే డే, సంపూర్ణ స్వాతంత్ర్యదినము, అఖిలభారతకిసాన్ దినములలో సంయుక్తప్రదర్శనాలను గావించి, తమ ఐక్యతను ప్రదర్శించవలసినదనియు యీ సభవారు కార్మిక కర్షకులను హెచ్చరించుచున్నారు.

9. నేషనల్ ప్లానింగు కమిషన్ ఏర్పాటును అభినందించుచు, భారతదేశములోని నిరుద్యోగమును నిర్మూలనము గావించుటకును, దేశీయుల జీవిత ప్రమాణాన్ని వృద్ధిచేయుటకును వీలుగా నుండునట్లు వ్యవసాయము నందును పరిశ్రమల యందును అది సమగ్రమగు ప్లానును త్వరలోనే ఏర్పాటు చేయునని యీ సభవారు ఆశించుచున్నారు.

10. భారతదేశములోని వ్యవసాయక ఫలసాయాన్ని ప్లాను ప్రకారం నిర్ణయించి దానికి న్యాయమగు ధరలు కల్పించవలయును. ఆ పంటలను వినియోగించి భారత పరిశ్రమలను పూర్తిగా అభివృద్ధి పరచవలయును. గ్రామీయ ప్రజలకు అందు పనులను కలుగజేయ వలయును. ఆహార పదార్థాలు మొదలగు వాడకపు సరకులను చవుకగా ప్రజాసామాన్యానికి అందుబాటగునట్లు తగు శ్రద్ధగా ఏర్పాటు చేయవలయును. వీనిని చేయనిచో నేషనల్ ప్లానింగు దేశమందలి దారిద్ర్యాన్ని నిరుద్యోగాన్ని నివారణ చేయలేదని యీ సభవారభిప్రాయ పడుతున్నారు.

నేషనల్ ప్లానింగ్ నందలి సభ్యులు చాలమంది వాణిజ్య పారిశ్రామిక ప్రయోజనాభిలాషకులేననియు, ఆకమిటీలో పేర్కొనబడిన సమస్యలుకూడ అట్టివే ఎక్కువగా నుండి వ్యవసాయక సమస్య కీయవలసినంత ప్రాముఖ్యత ఇవ్వబడలేదనియు గమనించి ఈసభవారు అసంతృప్తిని చెందుచున్నారు.

11. క్రిమినల్ ట్రైబ్సు ఆక్టును రద్దుచేయవలసినదనియు ఆచట్టాన్ని రైతు ఉద్యమాన్ని అణచుటకై ఉపయోగించుచున్నందుకు బెంగాల్ మంత్రివర్గాన్ని ఖండించుచు ఒక తీర్మానాన్ని, బెంగాల్ పంజాబ్ రాష్ట్రాలలోని రాజకీయ ఖైదీలను విడుదల చేయవలసినదని ఒకతీర్మానాన్ని, కిసాన్‌సభ సేవకులపై కొన్ని ప్రాంతాలలో దౌర్జన్య ప్రబోధనేరాన్ని అపాదించుచున్నందులకు విచారమును వెలిబుచ్చుచు అట్టి అసత్య అపాదనలవలన ఐక్యతకు భగ్నము కలుగుగలదని అభిప్రాయమును వెలిబుచ్చుచు, వేరొక తీర్మానాన్ని జమీందారీవిధానాన్ని రద్దుచేయాలనియు, భూమిపై సర్వాధికారాలు వ్యవసాయకులకే సంక్రమించేటట్లు చేయవలసినదనియు, ఒక తీర్మానాన్ని తమ ఎన్నికల వాగ్దానాలను భంగపుచ్చి రైతులను మోసపుచ్చినందులకు బెంగాల్ ప్రభుత్వమును ఖండించి ఆ వాగ్దానాలను వెంటనే అమలు జరుపవలసినదని బెంగాల్ ప్రభుత్వమును హెచ్చరించుచు మరియొక తీర్మానాన్నికూడ గావించారు.

క్రొత్తకార్యనిర్వాహక వర్గము
(కేంద్ర కిసాను కౌన్సిల్)

అధ్యక్షులు : ఆచార్య నరేంద్రదేవుగారు

ఉపాధ్యక్షులు: ఆచార్య యన్. జి. రంగా

ప్రధాన కార్యదర్శి :

స్వామీ సహజానంద సరస్వతి

సహాయ కార్యదర్శులు :

కామ్రేడ్సు ఇందులాల్ యాగ్నిక్, దామోదర స్వరూప్ సేట్, జె. బుఖారీ, చలసాని వాసుదేవరావు.

కోశాధిపతి : జామున ముఖర్జీగారు

కార్యనిర్వాహక వర్గము: కామ్రేడ్స్ జయప్రకాశనారాయణ, అవదేశ్వరప్రసాద్‌సిన్హా, మదునందనశర్మ, మోహనలాల్ గౌతం, జోగేష్ ఛటర్జీ, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, సురేశదేవు, పి. డి. మరాదే, డాక్టర్ ఆర్.

కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు

ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాధ్యక్షులును, పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు అధ్యక్షులునగు వీరు, అఖిల భారత కిసాన్ కార్యవర్గ సభ్యులుగ నెన్నుకోబడ్డారు.

సింగ్, మాలతీదేవి, నారాయణనాయర్, శివనాథ బెనర్జీ, బంకిం ముఖర్జీ, నిహారేందుదత్తు ముజుందార్, అబ్దుల్ రసూల్.

సహాయక సభ్యులుగా కామ్రేడ్సు స్వామీ భవాన్‌దాసు, డి. వల్లభరావు ఓ. కుమాస్వా, నారప్పన్నా, యన్. డి. శర్మగార్లు ఎన్నుకోబడిరి.

## మే. డే.

మే, దినోత్సవార్థము మే 3 వ తేదీ నవశక్తి సంచిక 32 పుటలతో వెలువడుతుంది. 8 పుటలు బొమ్మలు, వివిధ దేశాలలో కార్మికపోరాటాలను క్రూరముగా అణచివేసిన చరిత్రలు, సోవియటు తృతీయ పంచ వర్షీయ ప్రణాళిక, కామ్రేడ్ స్టాలిన్ ఉపన్యాసం మొదలగునవి ఉంటాయి.

వెల 2-అణాలుమాత్రము.



## అఖిల భారత రైతుసంఘ అధ్యక్షోపన్యాసం

(13 వ పేజీ తరువాయి) నిన్ని: 130 రోజులు కాలినడకను వారుచేసిన 2000 మైళ్ళ యాత్ర చరిత్ర ప్రసిద్ధమని తెలియజేశారు. ఈ ఉద్యమంలేనిచోట్ల కట్టుగా ఏర్పాటు చేయాలని అన్నారు.

"దేశంలో గొప్ప ప్రబోధం కలిగింది. ఇది సరిగా ఉపయోగించుకొంటే ఎంత పనియైనా చేయవచ్చును. వివిధరాష్ట్ర సమస్యలు పరిశీలించి దేశభాషలలో సారస్వతం తయారు చేయాలి. అదర్శప్రాయులైన ప్రచారకులను తయారుచేయాలి.

పోరాట చిహ్నం.

అధికారిక చిహ్నాన్నిగురించి తగాదా బయలుదేరింది. ఎఱ్ఱజెండాయే, సంస్థ జెండా. అయితే జాతీయ జెండానుకూడ ప్రేమించి దానిని గౌరవించాలి. ఆందుచేత యిదికూడ తీసికోవాలి.

కాంగ్రెసుయొక్క కొత్తహోదా

గత రెండు సంవత్సరాల నుండి జాతీయ స్వాతంత్ర్యపోరాటములో మహత్తరమగు శక్తి ప్రవేశించింది. స్వదేశసంస్థాన ప్రజలలో నూతన చైతన్యం పెంపొందింది. ప్రజలు నానాటికి వర్గవిజ్ఞానవంతులగు చున్నారు. వారి సంఘశక్తి అద్భుతంగా వృద్ధిచెందుతోంది. కార్మికులు, కర్షకులు ప్రతిచోటా తమ అత్యవసర కోర్కెలను నెరవేర్చుకోడానికి పోరాటాలను సాగిస్తున్నారు. ధనాధిపతులు భూస్వాములు తమ్మణచి వేయుట కుపయోగించుచున్న నిర్బంధ విధానాన్ని, హింసను, కార్మికకర్షకులు తీవ్రంగా ప్రతిఘటించి పోరాడుతున్నారు. కార్మికులు, కర్షకులు ఒకరి నొకరుపూర్తిగా అర్థంచేసుకొనుచున్నారు. వీరి సఖ్యత దినదినాభివృద్ధి నందుచున్నది. నానాటికి జాతీయపోరాటం పీడిత ప్రజల పోరాటముగా పరిగణింపబడు చున్నది. యిటీవలి సంవత్సరాలలో కాంగ్రెసుయొక్క ప్రతిష్ఠ పలుకుబడి, బాగా వ్యాప్తిచెందింది. అంతర్జాతీయరాజకీయాలలో కాంగ్రెసు చూపుతూన్న శ్రద్ధ, సామ్రాజ్యవాదము ఫేసిజములపట్ల దాని అసమ్మతి, స్వాతంత్ర్యము ప్రజాతంత్రములపట్ల దాని సానుభూతి, కలసి, ప్రపంచములో శాంతి, న్యాయం, ప్రజాతంత్రములతో విలసిల్లే, నూతన యుగాన్ని స్థాపించాలని శాయశక్తులా పనిచేసే వివిధదేశాలలోని ప్రజలతో సమాన హోదాలోనికి భారతీయులను గొనిపోయాయి.

ఉత్కృష్ట ఆశయాలకై కాంగ్రెసు అవలంబించేవైఖరి, రాజకీయంగారంగులుమార్చే స్వభావాన్ని అది నిష్కర్షగా ఎదుర్కోవడం, వల్ల భారతదేశముయొక్క ఖ్యాతిని వృద్ధిచేసి, విదేశాలలో రాజకీయంగా మనకు పలుకుబడిని ఎక్కువగావించింది. స్వాతంత్ర్యము లేక, పూర్తిగా పరాధీనస్థితిలోనున్నా, భారతదేశము తన వ్యవహారాలను తాను పరిష్కరించుకో గల స్థితికివచ్చినదని, ఇతర దేశాలన్నీ గుర్తించాయి. భారతదేశం తన విదేశీయ వ్యవహారాన్ని స్వతంత్రదేశమువలె స్వయంగా తానే నడుపుకొనే అధికారం కలిగియుండాలని కాంగ్రెసు ప్రకటించడమెంతయు సమయస్ఫూర్తిగా నున్నది.

అంటుచే, "భారతదేశములోని వివిధ కాంగ్రెసు శాఖలు, కాంగ్రెసు ప్రభుత్వాలు, ప్రజలు, అందరూ దేశాన్ని స్వాతంత్ర్యపోరాటం కొరకు తయారు చేయవలసినదని" త్రిపురీలో కాంగ్రెసు ప్రకటించింది. ప్రవాహముతో పాటు కొట్టుకొని పోతామనే సిద్ధాంతాన్ని కట్టిబెట్టింది. ఈ తీర్మానాన్ని మనమంతా హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాము.

ఈనిర్ణయం చేసేటప్పుడు కాంగ్రెసులోని వాతావరణమంతా వ్యక్తిద్వేషాలతోను సరస్పర వైషమ్యాలతోనూ వ్యాప్తమై వుండినది. త్రిపురీలో గావింపబడిన ఈ తీర్మానన్ని ఆ వాతావరణము మరుగు పరచి వేసింది.

"మనలో మనకున్న భేదాభిప్రాయాలన్నిటిని మనం వదలుకొని కాంగ్రెసులోని ఐక్యతను స్థాపించుటకు పూనుకోవాలి లేకుంటే ప్రస్తుతం రానున్న పోరాటం వెనుకబడి పోతుంది. అంతరంగిక కలహాలతో మనం మనశక్తులను వృథా పుచ్చక, మన తీర్మానాన్ని ఆచరణలో పెట్టడానికి అందరం నడుముకట్టి పనిచేయాలి. రైతు ప్రజలీ తీర్మానముపట్ల మిక్కిలి ఆసక్తిని చూపుతున్నారు. కాంగ్రెసు తనయొక్క యీతీర్మానాన్ని అమలు జరిపేటందుకు కావలసిన పరిస్థితులను కలగించుటకు పనిచేయ వలసినదిగా మిమ్మందరనూ కోరుచున్నాను. ప్రస్తుతము మనల నావరించియున్న నిరాశ తమః పటలమంతయు విచ్ఛిన్నమై ఆత్మ విశ్వాసముతో భవిష్యత్తుకు సాగిపోగలమని ఆసిస్తున్నాను.

## అఖిల భారత కిసాన్ మహాసభ

(11 వ పేజీ తరువాయి) ప్రతి విషయాన్ని, అది ప్రజలకు చేసే సదుపాయాన్ని బట్టి, మంచిచెడ్డలు విచక్షణచేసి, దాన్ని అంగీకరించడమో, నిరాకరించడమో నిర్ణయం కావాలని వాంఛిస్తాము;

రైతుల భూములను పరులు దౌర్జన్యంగా వశం చేసుకుంటున్నారు. వారి పంటలు పాడవుతున్నాయి, అప్పుల బాధ సహించలేక, కో-ఆపరేటివు సంఘాలయొక్కయు, షాహుకార్లయొక్కయు రాక్షసత్వాని సహించలేక రైతులు కృశించిపోతున్నారు. దిగంబరములై వారి కుటుంబాలు ప్రాణావశిష్టమై ఉన్నాయి, వారికి వైద్యంచేసే దాతయే కరవయాడు. వాళ్ళ గుడెసెలపైన కప్పులే కనుపించవు. ఇట్టి దీనావస్థలోనున్న రైతులకు స్వరాజ్యం, స్వాతంత్ర్యము అనే వట్టి కబుర్లు కూడ, స్వర్గము, మోక్షము అంటే ఎంతఎల్లా రుచిస్తాయో, అంతే రుచిస్తాయి. అందుచే మేము కోరేదేమిటంటే,—వారి భూమి వారికి సంక్రమించాలి. అప్పులు శిస్తు బకాయిలు రద్దు కావాలి. శిస్తులు, పన్నులు, నీటి తీరువాలు చాలావరకు తగ్గాలి, వారి తిండికి, గుడ్డకు, మందులకు ఎక్కువసదుపాయాలు జరుగాలి. వారీనాడు పడే బాధలు, అంతమొందాలి. అందుకై రైతుల పోరాటము దాని ప్రాముఖ్యతను నొక్కి వక్కాణించి దానిని సాగించాలని కోరుతాము. రానున్న స్వాతంత్ర్య పోరాటములోకి రైతాంగాన్ని తీసుకురావడానికి వారినిపూర్తిగా తర్ఫీదు చేయడానికి యిదే మార్గమని మా నిశ్చితాభిప్రాయము.

## పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థి మహాసభ

(పాలకొల్లు, ఏప్రిల్ 1, 2 వ తేదీలలో జరిగింది)

1. మహాసభను ప్రారంభించిన కాట్రగడ్డ రాజగోపాలరావుగారు, ఉపన్యాసకులు మునిపల్లి రామారావుగారు, ఇందున్నారు. 2. విద్యార్థుల ఊరేగింపు. 3. (కుడిప్రక్క) అల్లూరి సత్యనారాయణగారు విద్యార్థి, జాతీయ పతాకోత్సవముల జరిపారు.

## త్రిపురిసంచికలో సవరణ

త్రిపురి సంచికలో 98 వ పుటలోని దేశభక్తుల పటముల క్రింద పేర్లు తారుమారయ్యాయి. బాబా హర్నామసింగుకు బదులు, వీర్యామసింహా అనియు; వీర్యామసింహాకు బదులు బలవంత సింగు అనియు; బల్వంతసింహాకు బదులు, డా॥ మధురాసింహా అనియు; డా॥ మధురాసింహాకు బదులు హర్నామసింగు అనియు ఉండవలయును. పాఠకులు ఈ నాలుగు పటములపేర్ల క్రిందనున్న పేర్లు పైవిధముగ సవరించుకొనెదరని ప్రార్థించుచున్నాము.

100 వ పుటలో ప్రఫుల్లకుమారఛాకీ ఢిల్లీ కుట్రకేసు: అని ఉంది. అతను ఢిల్లీ కుట్రకేసులో కాదు శిక్షింపబడింది. ఖుదీరాంబోసుతోపాటు కెన్నడీ హత్య సందర్భములో అరెస్టు చేయబడినపుడు తుపాకితో కాల్చుకొని చనిపోయినాడు.

* * *

శరత్ చంద్ర చటర్జీ
రచించిన
## బడదీదీ

పుస్తకంగా వెలువడింది. మహాకవి రవీంద్రుని వంటివారిచే ప్రశంసింపబడినది. దీనిని న్యూథియేటర్సువారు చిత్రంగాకూడా తీశారు.

వెల నాలుగణాలు మాత్రం
ప్రతులకు నేడే వ్రాయండి.
నవశక్తి కార్యాలయం
బెజవాడ

## తెనాలి

లక్ష్మీ ప్రెస్ లాకౌటు.

మునిపల్లి రామారావు అను ప్రెస్సు వర్కరును లాక్ అవుటు చేయబడినవారు కొట్టారని వార్తలను, తెనాలి యూనియను కార్యదర్శి ఖండిస్తూ, పనివారు సాగిస్తూ ఉన్న పోరాటాన్ని బలహీన పర్చడానికి చేసిన అభూతకల్పయేయని తెలియజేయుచున్నాడు.

# స్త్రీ ఉద్యమం

శ్రీమతి పర్చూరి సూర్యాంబ

ఏదేశములో నయినను స్త్రీలు యెల్లప్పుడు వంటగదిలోనే యున్నంతకాలము మాత్రము, ఆ దేశము స్వాతంత్ర్యమును బొందనేరదని లెనిన్ మహాసయుడు నుడివియున్నాడు. ప్రస్తుతము మన హిందూ దేశమందట స్త్రీ గృహకృత్యములను దిద్దు దాసిగనుంటున్నది. ఏ ఉద్యమ మయినను నిర్విఘ్నముగ పనిచేయుటకు విద్య అవుసరము. ఆ విద్యయే మన హిందూదేశమందలి కోటానుకోట్ల ప్రజలకు లేక మన దేశమును ఇంత బానిస దేశముగ తయారుచేసి, ప్రతి విషయమందును పాశ్చాత్యదేశీయులకన్న మనలను వెనుకబడవైచిఉంచినది. ఇక స్త్రీల విషయమై చెప్పనవుసరము లేదు. ఈ దేశమందు ప్రస్తుతము నూటికి ముగ్గురు స్త్రీలకన్న హెచ్చుమంది విద్యావతులు లేరు. ఇచ్చట స్త్రీ విద్య యింత వెనుకబడి యుండుటకు రెండు కారణములున్నవి. మొదటిది గవర్నమెంటు స్త్రీ విద్యకు హెచ్చు వినియోగించకుండుట. రెండవది స్త్రీలు ఉపాధ్యాయ పదవులందు లేకపోవుట.

అయినప్పటికి మన మెల్లరము మహిళా సంఘములందు విరివిగా చేరి స్త్రీ విద్య పెంపొందించగలందులకై గవర్నమెంటువారిని ఒత్తిడి చేయవలయును. అదియును గాక విద్యావంతురాలయి, దేశ సౌభాగ్యమభిలషించు, 'తప్పక అభిలాషించవలసిన" ప్రతి స్త్రీ తన తీరుబడికాలమును వృథాపుచ్చక విద్యరాని తక్కిన సోదరీమణులకు విద్య గరుప యత్నించు టత్యావశ్యకము. మనదేశమందలి స్త్రీవుద్యమముగూడ పాశ్చాత్య దేశములతో తులతూగునట్లు చేయుటకు మనము రష్యా, స్పెయిను మొదలగు దేశమందలి స్త్రీలను ఆదర్శప్రాయులుగ తీసికొనవలయును.

మదామ్ క్రుప్‌స్కాయ్యను మనము ఆదర్శముగా తీసికొనవలయును. మదామ్ క్రుప్‌స్కా అను నామె లెనిన్ మహాశయుని భార్య. ఈమె 1917 సం॥లో రష్యాలో జరిగిన అక్టోబరు విప్లవములో ఆ దేశపు మహిళా సంఘ నాయకత్వము వహించి, విప్లవమును జయప్రదము గావించుట కీమె యొనర్చిన దేశసేవ శ్లాఘనీయము. లెనిన్ స్మృతియను గ్రంథము వ్రాయుటతో యీమె కీర్తి నల్దిక్కుల వ్యాపించినది. ఈమెగారి జీవితమంతయు దుర్భర దారిద్ర్యములోను, దేశాంతర వాస శిక్షలలోను, రహస్య స్థలా నివాసములందును గడపినది.

స్త్రీ గడప దాటరాదంటారు. స్త్రీవిద్య భారతసంఘానికి గొడ్డలిపెట్టువంటిదంటారు. ఈసూత్రమునే రష్యా స్త్రీలు పాటించి యుండినచో ఇప్పు డాదేశమనుభవించుచున్న స్వేచ్ఛ అనుభవింపకపోవునేమో యనిపించును. ఇక చైనాదేశమందలి స్త్రీలన్ననో, వారు రణరంగమందు దుమికి జపానువారితో పోరాడుచున్నారు. సైనికులకు మేజోళ్ళనునైతము కట్టి యిచ్చుట, గుడ్డలు తెచ్చిపెట్టుట, యుద్ధమందు చనిపోయినవారి పిల్లలను పోషించుట మొదలగు కార్యములను నేరవేర్చుచున్నారు. చైనాదేశమందు మహిళాసంఘములు దినదినాభివృద్ధిని గాంచుచున్నవి. ఈ మహిళా సంఘములు ప్రభుత్వమునకు మిక్కిలి తోడ్పడుచున్నవి. అచ్చట రష్యాదేశమందువలెనే స్త్రీ పురుషులకు తేడాలు గాన్పింపవు. ఇప్పుడు జపానునారి అక్రమ దాడిని ప్రతిఘటించుచున్న స్త్రీలు యేబదివేలకంటె ఎక్కువగా నున్నారు. వీరిలో ఆస్థిపాస్థుల విచక్షణలు లేక విద్యార్థినులు, ఉపాధ్యాయినులు, రైతు యువతులు మొదలగువా రందరు యుద్ధభూమి కురుకుచున్నారు. వీటన్నిటికంటెను చైనా స్త్రీలు చేయు కార్య మింకొక్కటున్నది. ఆస్త్రీలు చైనా రైతులకును, సైనికులకును మంచి సహకారమును చేకూర్చుచున్నారు.

మన దేశమందుగూడ అట్టి సాధ్వీమణులు లేకపోలేదు. సరోజినీదేవి, విజయలక్ష్మీ పండిట్ మొదలయిన సాధ్వీమణులు వారి వారి జీవితములన్నియు దేశసేవకై వినియోగించుచున్నారు. జయపూరు, రాజకోట, తిరువాన్కూరు మొదలయిన సంస్థానములలో బాధ్యతాయుత ప్రభుత్వముకొరకు సల్పు పోరాటములలో స్త్రీలు సయితము ముందంజవేయుట మనము గాంచుచనే యున్నాము. మన మందరము ఎల్లప్పుడు అట్టి సాధ్వీమణులను బొగడుచుండుటయే గాక, మనముగూడ విరివిగా మహిళా సంఘములందుజేరి సామ్రాజ్యవాద తత్వమును కూకటివేళ్ళతో పెళ్ళగించగలందులకై మనవారు సల్పుచున్న పోరాటమును బలపర్చుచుండవలయును. అన్ని విషయములందును స్త్రీలు సయితము పురుషులకు సమానముగా నుండవలయును. స్త్రీ పురుష భేదము నశింపజేయుట కెక్కువ కృషి యొనర్పవలయును. ప్రతి విద్యాలయమందును, ప్రతి క్లబ్బుయందును స్త్రీలకుగూడ ప్రవేశముండునట్లు చేయవలయును. ఆస్థి హక్కులు స్త్రీ పురుషులకు సమానముగా నుండునట్లు చేయుటకును, మైనారిటీ వెళ్ళగనే ఓటు చేయగల హక్కును యిచ్చుటకును, విధవా వివాహముల కనుజ్ఞ యిచ్చుటకును మనము గవర్నమెంటువారి హక్కును పొందవలయును.

మనము నెరవేర్పవలసిన పనులలో గృహపారిశుభ్రత, పిల్లల విద్యను గమనించుట, మొదలగు వాటితోపాటు దేశములోని మానవ జాతికి తోడ్పడుము. పీడిత ప్రజల దాస్యవిమోచనము కొఱకై యెక్కువ కృషి యొనర్చుచుండవలయును. ప్రేమలేని పెండ్లి పెండ్లిగాదన్న సంగతి గుర్తెరిగి ప్రతి స్త్రీయున్నూ తాను ప్రేమించిన వరుని మాత్రమే పరిణయమాడవలయును. అంతకంటెను ముఖ్యముగా, పరదా పద్ధతి పోనిదే మనమే కార్యమును నెరవేర్పలేమన్న సంగతి మరువరాదు.

గాంధి, స్త్రీలను గూర్చి ఒకప్పుడిట్లనియున్నాడు. "చెడుగునందుసైతము మంచితనముయొక్క ఛాయ కాన్పించును. స్త్రీలు, మనలో పరస్పర విశ్వాసమును పురిగొల్పి, తమ విశ్వాస బలిమిచే మనలో నీచాతినీచులగువారియందుసైతము 'మంచితనపు ఛాయలను వృద్ధి నొందించెదరని యాశించుచున్నాను." అట్టి మహనీయుని వాక్కును ప్రతి హిందూ వనితయున్నూ శిరసా వహించగలందుల ప్రార్థించుచున్నాను.

"నాకిచ్చట తిండిపెట్టలేని దేవుడు ఎప్పుడో మోక్షమిస్తాడనుట నేను నమ్మ"నని వివేకానందస్వామిగారన్నమాటను మనము మరువరాదు కుల భేదములు ఎప్పటికిన్నీ పాటింపరాదు. భారతదేశమందలి ప్రజలందరిని యిన్ని మతములు గాను, కులముల గాను విభజించి మనలోమనకుంచిన ఐకమత్యమును చీల్చివేసియే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మనలను పాలించగల్గుచున్నారన్నసంగతి భారత నారీమణులు మరువకుందురుగాక.

## అన్నామలై విద్యాలయంలో సమ్మె

(9 వ పేజీ తరువాయి) టర్లవలన ఏర్పడిన కాళీస్థలము బర్తీచేయుట విద్యార్థుల మొదటి పనియైనది. చాలా మంది విద్యార్థులు గాయషుల పాల్పడిరి. ఒకనికి తీవ్రగాయములు తగిలినవి—ముక్కూ నోటా రక్తం గ్రక్కెను. అధికారుల యీ చర్యలు విద్యార్థుల ఉద్రేకాన్ని, రోషాన్ని మాత్రం చూరగొన్నాయి.

ఆనాటి సాయంత్రం పోలీసులు సమ్మె జరిగే స్థలమునకు వచ్చిరి. వైస్ చాన్సలర్, రిజిష్టార్ మొదలగు వారును గలరు. లాఠీఛార్జికూడా జరిగినది. ఒక విద్యార్థిని వారంటు లేకుండానే ఎరస్టుచేసిరి. ఈలోపున వైస్ చాన్సలర్ మరల శాంతి భద్రతలు నెలకొల్పేందుకే తాను చేస్తున్న ప్రయత్నం తగినట్లుగా మాత్రం ఉంటుందని మరో నోటీసు జారీ చేసిరి. ఆ రాత్రి సుమారు 500 మంది విద్యార్థులు నిర్ణీత ప్రదేశంనందు సమావేశమైరి. విద్యార్థులు తమ కర్తవ్యమునుగూర్చి, కోర్కెలనుగూర్చి చర్చించుకొనిరి.

### 45రోజులు కాలేజీ మూసివేయబడుట

అది సమ్మె దినము. ఉదయము 10 గం॥ యధాప్రకారము పికెటింగు ప్రారంభింపబడినది. అప్పుడే "16 డిసెంబరు '38 వరకు విశ్వవిద్యాలయము మూసివేయబడినది" ఇది నోటీసునందలి సారాంశము. విద్యార్థులు మొదట ఇండ్లకు పోవరాదని తీర్మానించుకొనిరి. కాని హాస్టలు మూసివేయబడును గాన వారాప్రయత్నమును మానుకొనవలసి వచ్చెను. అధికారులు, ప్రతి విద్యార్థికి అతను యింటికి పోవుటకై బదులు నివ్వనంగీకరించిన రు. 10 లు తీసుకొనవచ్చునని వారు తీర్మానించిరి. అందువలన వారు వెళ్ళిపోవలసివచ్చెను. అధికారులు పన్నిన పన్నుగడ చాల గభీరమైనది. విశ్వవిద్యాలయము 15 రోజులు మూసివేయడము, సెలవులు 30 రోజులవరకు పొడిగించడము విద్యార్థుల బలాన్ని, చీలదీయటానికీ, వారి పట్టుదలను క్రుంగదీసేందుకు పన్నిన పన్నుగడ. తల్లిదండ్రులద్వారా వారిపై ఒత్తిడి తెప్పించేందుకు ఎత్తిన ఎత్తుగడ.

### మరల పోరాటం

16 జనవరి '39 వ తేదీని తిరిగి కాలేజీ తెరువబడినది. తిరిగి వెంటనే పోరాటము ప్రారంభింపబడినది. పోలీసులు రప్పింపబడిరి. వారి రాక పోరాటపు తీవ్రతను తగ్గింప నిర్దేశింపబడినది కాని అది విద్యార్థులలో 'అపాయకరమగు' శక్తిని రేకెత్తించినది. సస్పెండు చేయబడిన 12 గురు విద్యార్థులను గూర్చి తిరిగి గొప్ప ఊరేగింపు జరిగినది 144 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ సస్పెండు చేయబడిన 18 మంద విద్యార్థులపై ప్రయోగింపబడినది. విషమపరిస్థితులు అధికారుల మనోధైర్యమును, గుండె నిబ్బరమును కూలద్రోసాయి. ఈ లోపున ఒకరాజీనామా జరిగింది. దానివలన సస్పెండు చేయబడిన 18 మంది క్షమాపణపత్రము నిచ్చిన తిరిగి కాలేజీలో చేర్చుకొనవలెను, కాని అధికారులు చాల కుతంత్రమైన రాజనీతిని పాటింప సాహసించిరి. 12 గురినే తిరిగి చేర్చుకొనిరి. వారిలోనైనా ఒకవిద్యార్థిని కలరా భయంకరముగా పట్టణంలో ఉండే హాస్టలులో చేర్చుకోలేదు. గౌ॥ సుబ్బరాయన్, ప్రధానమంత్రి రాజగోపాలాచారిగార్లు సంధికొరకు ప్రయత్నించారు. కాని అవి విఫలమయ్యాయి. ఆ ఆరుగురిని తిరిగి కాలేజీలో చేర్చుకొనేందుకు విద్యార్థులే అంగీకరించరని అధికారుల వాదన!

### జయము విద్యార్థులదే!

ఇటువంటి ఉద్రేక జనిత సమయములోకూడ విద్యార్థుల సమ్మె శాంతముగానూ, అహింసా యుతముగాను జరుపబడినది. ఫలితము ఏవిధముగా పరిగణించినా, అన్నామలై విద్యార్థుల సమ్మె చరిత్రాత్మకమైనది. విద్యార్థుల ధైర్యోత్సాహముల కది శంఖారవము కాగలదు. తమిళ దేశ విద్యార్థి ఉద్యమమున కది మొదటి మైలురాయి.



# యుద్ధము—ప్రపంచశాంతి

(8 వ పేజీ తరువాయి)

శాంతికి సోషలిజము ఎలా దారితీస్తుంది.

సోవియట్ యూనియన్‌లో కూడా ప్రభుత్వము వర్గసాధనమే. కాని అసంఖ్యాకులైన శ్రామికవర్గం చేతిలో రాజ్యం వుండి, వుత్పత్తి సాధనాలు వారి చేతులో వున్నందున.

(1) రాష్ట్రాంతర్గతముగా వర్గ వైరుధ్యము, నిరుద్యోగ సమస్య లేకపోవుట.

(2) కాలనీల అవుసరము లేకపోవుటచే, యుద్ధ మనవసరమగుట.

ఈ రెండింటిని ప్రత్యక్షముగా గమనించుచున్నాము. అందుచే రష్యాకు, తనను సామ్రాజ్యవాదుల బారినుండి తప్పించుకొనుటకు తప్ప వేరేఎందుకును యుద్ధావశ్యకత లేదు. ఈ విధంగా కొద్దిలో సోషలిస్టు సమాజము ఏ విధంగా ప్రజల శాంతికి సహాయకారియో కన్పడుతోంది. అందుచేతనే సోవియట్ యూనియను, శ్రామికులపాలిటి కల్పతరువై, పీడిత రాజ్యాలకు పరమమిత్రమై, సామ్రాజ్యవాదులకి సింహ స్వప్నమై విరాజిల్లుతోంది.

ఈ యుద్ధాల్ని గురించి, యింకో అపోహవుంది. అది ఏమిటంటే కొన్ని జాతులు స్వతః యుద్ధ నైజముగలవారని బలవంతులు బలహీనులను వశపర్చుకోటం సహజమనీ. ఇది వెర్రియూహ.

ప్రజల లక్షణాలు, రాష్ట్రములోని వర్గ నిర్మాణాన్ని బట్టియే యుంటాయి. వీరోచిత లక్షణాలు, జాతి స్వచ్ఛత మొదలగు పదములు, తమ ప్రజల చూపులను నిజ పరిస్థితులనుండి తప్పించుటకు సామ్రాజ్యవాదులకు సృష్టింపబడినవి అని చరిత్రాత్మకంగా తెలుస్తుంది.

రెండవ సామ్రాజ్య యుద్ధములోని ప్రత్యేక పరిస్థితులు.

(1) సామ్రాజ్యవాదుల లాభతృష్ణ



జపాను సైనికులను యుద్ధంలో ఆహుతికై రమ్మని ప్రోత్సహించడానికి ప్రకటింపబడినదీ పటం.

ఆస్థిరత్వము హెచ్చి ఫాసిజంగా మారుట. అందుచే యిదివరలో సామ్రాజ్యవాదాన్ని సమర్థించే మధ్య తరగతులలో కూడా తీరని అశాంతి ప్రబలి, శ్రామికవర్గంతో సానుభూతి చూపిస్తారు.

(2) వలస రాజ్యాలలోనుండే ప్రజల తరపున ఆందోళన.

(3) ప్రపంచంలో ఆరవవంతు సోషలిస్టు సమాజముక్రింద నుండుట.

(4) అందుచే కార్మిక వర్గంలోని అమితోత్సాహం.

సామ్రాజ్యవాదులకు యీ యుద్ధాలేవిధంగా వుపకరిస్తాయి.

(1) మామూలుగా వుపయోగించే వాడుక పదార్థాలు తయారు చేస్తే అవి కొంటానికి ప్రజలలో శక్తిలేదు. ఎందుకంటే ధనం వకచోట కూడివుండబట్టి.



యుద్ధ ఫలితంగా మరణించిన చినా యువతి

అందుచే ఆయుధ సామగ్రిలో ఎక్కువ ధనం పెట్టుబడిపెట్టుట.

(2) యుద్ధ సామగ్రిని తయారుచేయటము, త్వరితగతిని సాగిస్తూ, కొంచెం నిరుద్యోగ సమస్య తగ్గింపవచ్చు. సిపాయీలుగా కొందరిని సర్దవచ్చు.

(3) యుద్ధంలో చాలామంది చావటం మూలంగా, నిరుద్యోగ బాధ కొంత తగ్గుతుంది. ఇతరుల యుత్పత్తి సాధనాలు తగ్గిస్తే తరువాత తమకు పోటీ తగ్గుతుంది. కొన్ని వలస రాజ్యాలను సంపాదించవచ్చు.

(4) వీలు కలుగజేసుకొని తమ పరమశత్రువైన సోవియట్ యూనియనును భగ్నము చేయవచ్చునను ఆశ.

అందుచే యుద్ధ సమస్య సామ్రాజ్యవాదములో అంతర్గర్భితమైందని చూచాము, సోషలిస్టు సమాజమే శాంతికి దారి తీయునని కూడా గమనించాము. కాబట్టి నిజమైన శాంతి ఉండాలంటే

1. సామ్రాజ్యవాదము నశించాలి.

2. సోషలిస్టు సోవియటు యూనియనుతోనూ, ఇతర ప్రజాస్వామ్య ప్రభుత్వాలతోనూ కలసి అందుకు ప్రయత్నించాలి.

భారతీయుల కర్తవ్యం ఏమిటి?

బ్రిటిషు సామ్రాజ్య దాస్యశృంఖలాల్లో వున్నాము కాబట్టి ముందు వారి వైఖరి మనము గమనించాలి. అప్పుడే మన దృక్పథము నిర్ణయించాలి.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు, తప్పక ఈ యుద్ధకాలములో, భారతీయుల యావశ్శక్తిని తమ యుద్ధ యంత్రానికి కట్టటానికి ప్రయత్నిస్తారు. వలస రాజ్యాలలో తిరుగుబాటును అతి క్రూరముగా అణచడానికి కూడా వెనుదీయరు. అందుకు ఉదాహరణము.

(1) భారత దేశములో ఫెడరేషను పెట్టటానికి చేసే ప్రయత్నాలు

(2) యుద్ధ వ్యతిరేకప్రచారాన్ని ఆపడానికి పెట్టిన చట్టము

(3) ఫెడరేషనులో ముఖ్య స్థానము ఆక్రమిస్తున్న సంస్థానాలలోని ఆందోళనను అతి దారుణముగా అణచడము

(4) సరిహద్దురాష్ట్రములో బాంబుల వర్షము కురిపిస్తూండడము. కమ్యూనల్ కలహాలు వృద్ధిపొందించడము.

అంతర్జాతీయముగా

(1) ఇరాక్, పాలస్టయినులలో మత కలహాలు పెంచటం, బాంబులతో శాంతి భద్రతల పేరిట ప్రజా వుద్యమాన్ని ధ్వంసము చేయడము,

(2) జెకోస్లొవేకియాను కాళ్లు చేతులు కట్టి, ఫాసిస్టు రాక్షసుల చేతిలో పెట్టడములో సహాయము చేయడము. స్పెయిన్ స్వాతంత్ర్యపోరాటాన్ని తటస్థవిధానమును పేరిట పూర్తిగా భగ్నము చేయడము,

(3) ఫాసిస్టు దురంతాలకి సానుభూతి చూపిస్తూ, సోవియట్ ప్రభుత్వాన్ని వంటరి చేయటానికి చేసే ప్రయత్నాలు

(4) చైనాపై జపానుప్రభుత్వ దాడిని ఆరికట్టకుండా ఉండడము.

ఈ పైవిషయాల మూలముగా బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చర్యలు, ప్రజా వాంఛలకు వ్యతిరేకముగను, ఫాసిస్టులకు సన్ని





స్పానిష్ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టడానికి తుది దాకా కృషిచేసిన స్పైన్ వీరవనితల చిత్రించుతున్నది ఈపటం.

హితముగను కన్పడుతున్నాయి.

కాన భారతీయులు మానవ శాంతి కొరకై పాటుపడవలెనంటే, ఫాసిజానికి ముఖ్య సహాయకారిగా నున్న బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని నిర్మూలించాలి. అంటే అందులో భారత స్వాతంత్ర్య సంపాదన ప్రథమ సోపానము—అందుకని యీ క్రింది ముఖ్య సూత్రాలపై ఆధారపడి కార్యక్రమము వుండాలి.

(1) ఫెడరేషనును భగ్నపరచాలి. అందుకు గాను మన యావచ్ఛక్తులు వినియోగించాలి.

(2) అంతర్జాతీయ పరిస్థితులలో, బ్రిటిషు సామ్రాజ్యవాదులు యుద్ధపరిస్థితులలోకి వస్తే, తప్పక ఆ సమయాన్ని భారత స్వాతంత్ర్యానికి వినియోగించుకొని సర్వతోముఖ శాసనోల్లంఘనము సాగించాలి.

(3) తీవ్రమైన యుద్ధవ్యతిరేక ప్రచారము సాగించాలి. ఒక్క భారతీయుడు గూడా సైన్యములో వుండ గూడదు. ఒక్క రూపాయి కూడా యుద్ధకోశములోకి పోగూడదు.

(4) సామ్రాజ్యవాద యుద్ధానికి గురియైన దేశాలతో సంపూర్ణ సానుభూతి వహించాలి.

(5) అన్నిటికీ మించి, జాతీయ సామ్రాజ్య వ్యతిరేక శక్తులన్నింటిలోనూ ఐక్యత చేకూర్చాలి.

## నిర్మాణ సమస్యలు

ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా పోరాటము సాగించడానికి దేశములో సన్నాహాలు జరుగుతున్న సమయములో నిర్మాణావశ్యకతనుగూర్చి ప్రత్యేకముగా తెలుపనవసరములేదు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారిచే ప్రకటించబడిన ఈ పుస్తకము, స్వాతంత్ర్య యోధులకు ఈ నిర్మాణ సమస్యను పరిష్కరించడానికి అనేక సూచనల నిస్తుంది. వెల అణా. వెంటనే నవశక్తి ఆఫీసుకు వ్రాయండి.

# లేఖలు

### కొల్లిపర డాక్టరు లంచాలు

ఆత్మకూరు కాపురస్తుడు కొమ్మా మోహను కుమారుడు సామ్యుయేలు అను తల్లిలేని 10 సంవత్సరముల కుఱ్ఱవాడు దావులూరులో తన మేనమామల వద్ద జీవించుచూ యేపారపాటునో ఒక తుమ్మగింజను చెవులో వేసుకొనెను. సదరు కుఱ్ఱవానిని నేను వెంటబెట్టుకొని 14-4-39 వ తేదీన ఉదయం 8½ గంటలక్కు కొల్లిపరగ్రామములో యున్న జిల్లాబోర్డువారి ఆసుపత్రికివెళ్లి డాక్టరుగార్కి కుఱ్ఱవానిని చూపి వానికి జరిగిన విషయము చెప్పితిని. అంతట డాక్టరుగారు చూచి యీగింజ తీసినందులకు రు 0-8-0 యివ్వవలెనని చెప్పిరి. నేను కూలీ వాడు పేదవాడు అనిన్నీ డబ్బులు పిల్లవానివద్ద లేవనిన్నీ కుఱ్ఱవాని కష్టమునుసహించలేక నేను తీసుకొనివచ్చినాను అని డాక్టరుగారితో చెప్పి తిని. అందుకుకూడా వారు అంగీకరించక. నీవు ఎక్కడనయిన తీసుకొనివచ్చి యిచ్చినయెడల తీస్తానని లేనియెడల తీయను అని చెప్పినందున్న ఆగ్రామములోని పల్లెకు వెళ్లి పంతులుగార్ని అడిగి రు 0-8-0 తీసుకొని వచ్చి యిచ్చిన తర్వాత చెవులోయున్న గింజతీసిరి. యిట్లు చేయుట చాలా అన్యాయము. ప్రజాక్షేమమును పరమావధిగా పెట్టుకొని ముందంజ వేయుచున్న కాంగ్రెసువారి ఆధీనములోయున్న జిల్లాబోర్డు వారిచే నియమించిన డాక్టర్లు యిట్టి అవినీతికర ములైన పనులు చేయుచున్న కాంగ్రెసు ప్రతిష్టకు భంగకరము కాన యిట్టి వారిపై వెంటనే తగుచర్య తీసుకొనవలసినదిగా జిల్లాబోర్డువార్ని గోరుచున్నాను.

ఇట్లు
కాబోతు రామస్వామి,
గుంటూరుజిల్లా వ్యవసాయకూలీ సంఘ ప్రసిడెంటు.

* * *

### చల్లపల్లి యెస్టేటులో గాజుల్లంక రైతుల కిష్టాలు.

ది 27-3-39 తేదీన జరిగిన సంఘటనను గూర్చి (5-4-39 పత్రికలో పడింది) ఎస్టేటు మేనేజరుగారివద్ద మొఱబెట్టుకొనుటకు మరునాడు యిద్దరు రైతులు చల్లపల్లి వెళ్ళిరి. గాజుల్లంక నముద్దారుగారి బంధువులు వారిని హోటలులో కొంతమంది రౌడీలతో ముట్టడివేసి కొట్టబోగా మెల్లో తప్పుకొని గ్రామముచేరిరి. ఆరౌడీలు అప్పుడే భోజనముచేసి లేచిన ఒక మనిషిని తన్నగా వెళ్లికలబడెను.

అప్పటినుండియు గ్రామములోనివారు భయపడుచున్నారు. పోలీసు సబ్ యినస్పెక్టరుగారు పిలిపించగా రైతులు వెళ్లలేదు. మేము లోగడ గ్రామమునసబుగారి ద్వారా పోలీసు స్టేషనును పెట్టుకొన్న రిపోర్టు యేమయినదో తెలియదు. మాతరఫువారిని మాత్రం మునుపటియవ రాత్రి జున విచారించి సాక్ష్యములు తీసుకొనిరి. జావి రెడ్డి సరసయ్యగారు ది 5-4-39 తేదీన రాజాగారికి బంధువు మిత్రులను యెగు ఒకరిని వెంటబెట్టుకొని పోకుకుపోయెను. తనవెల్లను దర్శన మివ్వకపోగా దీనునై తిరిగివచ్చెను. మరునాడు ఆరెండవ ఆయన తిరిగివచ్చి రాజీ పద్ధతి ఆనుసరించేదేనియు, మేనేజరుగారితో సహా రాజాగారికి గాజుల్లంకనుగూర్చి అనేక అపోహలు కలిగించిరనియు చెప్పెను.

ది 7-4-39 తేదీన మంగళలంకనుండి దొర గారి నౌకర్లతో 5 లేక 6 మోపుల మొక్కజొన్న చొప్పను సరికించుకవెళ్ళి చింతర్లంకలో మునసబుగారి యింటివద్దపడవైచిరి. మరునాడు వుదయం సర్కిలు, సబ్ యినస్పెక్టర్లను తీసికొనివచ్చి ఆ చొప్పను గాజుల్లంకలోని నరసయ్యగారి మేడెములో మూపించిరి. సరసయ్య మొదలైన వారిని పిలిపించగా యిండ్లవద్దలేరు. మరునాడు వుదయం 8 గంటలలోగా చల్లపల్లి స్టేషనువద్ద తప్పక హాజరు కావలెనని చెప్పి వెళ్ళిపోయిరి. కాని యెస్టేటువారియొక్క పన్నుగడలకు రైతులు భయభ్రాంతులై యేమి జరుగనున్నదో గ్రహింపలేక కొన్నాళ్లక యీసారి కూడ విరమించిరి. యెస్టేటువారు కేసులు యేవిధముగా సృష్టింతురో యింతవరకును స్పష్టంగా తెలియకున్నది.

ఇట్లు
సనకా పోతయ్య
కార్యదర్శి
గ్రామరైతు సంఘం, గాజుల్లంక.

* * *

### మునగాల యస్టేటులో కాంగ్రెసు ప్రచారకుల సంచారము

మునగాల యస్టేటులో జమీందారుగారికి రైతులకు కలిగిన వివాదములను గురించి తిరిగి 30-3-39 తేదీన బెజవాడలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఇచ్చిన రాజీషరతులను అమలు జరుపుటకు ఈక్రిందనుదహరించినవారు గ్రామముల వెంట విరివిగా ప్రచారము గావించుచున్నారు. మొదటి బ్యాచివారగు శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావుగారు, వుప్పల రామయ్యగారు, జీడిమిట్ల శీతారాంరెడ్డిగారు, కందుల రామంగారు సుంకర మొగ్గయ్యగారలు, 5-4-39 తేదీనుండి, మునగాల, తాడువాయి, గణపవరం, తిమ్మారెడ్డి పాలెం, కొక్కరేణి, ముకుందాపురం, ఆకుపాదుల, చాకిరాల, వగైరా గ్రామముల్లోను రెండవ బ్యాచిగా బయలుదేరిన శ్రీ నండూరి ప్రసాదరావు చిట్టాల గోపిరెడ్డి, గట్టు గోపాలక్రిష్ణయ్య, కొల్ల రామకోటయ్య, వగైరాగార్లు నడిగూడెం, నక్కలకోవ, రామసముద్రం, మాధవరం, శీతారాంపురం, రేపాల, పర్వింహలగూడెం, జగన్నాధపురం, కేశవాపురం, కరివిరేల, రామచంద్రాపురం, శిరిపురం వగైరా గ్రామముల వెంబడి ప్రచారము గావించుచు బ్రహ్మయ్యగారి తీర్పుప్రకారం శిస్తుల చెల్లించవలెననియు, రాజీషరతులను ఏమాత్రం వుల్లంఘించకుండా అమలు జరుపునటుల ప్రబోధించుచు ప్రచారము గావించుచున్నారు.

అక్కరాజు మాధవరావు,
నడిగూడెం.

* * *

### తెనాలి రేపల్లె డివిజను వేసంగి రాజకీయ పాఠశాల (పల్లెకోన)

రాబోవు మే 1 వ తేదీనుండి పల్లెకోన గ్రామములో, తెనాలి, రేపల్లెతాలూకాల వేసంగి రాజకీయపాఠశాల వలంటీరు శిక్షణశిబిరం ప్రారంభమగును. మే 1 వ తేదీనుండి 15 వ తేదీవరకు 15 రోజులు పాఠశాలనడుపబడును. ఉత్సాహవంతులగు కార్మిక, కర్షక, విద్యార్థి యువకులకు ప్రస్తుతరాజకీయ పరిస్థితులను బోధపరచి, తగినశిక్షణ నిచ్చుటయే పాఠశాల యొక్క ప్రధాన ఆశయం.

ముఖ్యముగా ఈక్రింది విషయములను గురించి బోధించబడును.

1. హిందూదేశములో బ్రిటిష్ రాజ్యస్థాపన.
2. కాంగ్రెసు పుట్టుక - స్వాతంత్ర పోరాటముల పరిణామం.
3. అంతర్జాతీయ కార్మికోద్యమం. పరిణామము. హిందూదేశములోని కార్మికులు. అఖిల భారత కాంగ్రెసు.
4. రైతు ఉద్యమం, అవశ్యకత. హిందూదేశములోని రైతుపోరాటములు. చరిత్ర. రైతు కాంగ్రెసు, రైతుకూలికుండవలసిన సంబంధం.
5. అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులు. సామ్రాజ్యవాద యుద్ధాలు, స్వాతంత్రవిప్లవాలు.
6. వివిధరాజకీయ సిద్ధాంతాలు.

యివిగాక, యితరవిషయము లనేకములను గురించి అనుభవజ్ఞులైన అధ్యాపకులు ఉపన్యాసము లిచ్చెదరు. వలంటీరు డ్రిల్లు, శిక్షణకూడా ఇవ్వబడును.

అవసరమగు శిక్షణనిచ్చుటకై పాఠశాలను 15 రోజులు మాత్రమే నడుపబడును.

విద్యార్థిరుసుము (భోజనాది సౌకర్యములన్నియు కలిపి) 5 రూపాయిలు మాత్రమే. కావలసినటువంటి పుస్తకములు, పేపర్లు అన్నియును స్కూలు ఆర్గనైజర్లే తెప్పించెదరు.

తెనాలి. రేపల్లె తాలూకాలోని యువకులందరు, ఈమంచితరుణమును పోగొట్టుకొనక శాస్త్రీయమైన. రాజకీయవిజ్ఞానమును, శిక్షణను పొందుటకు. పాఠశాలకు అధికసంఖ్యాకులుగా వస్తారని నమ్ముచున్నాము.

దరఖాస్తులు, విద్యార్థిరుసుములతో సహా ఏప్రియల్ ఆఖరులోపల ఆర్గనైజరుగారికి చేరవలెను.

కె. వెంకటరత్నము,
పబ్లిసిటీ ఆఫీసరు. పల్లెకోన.
చదలవాత పిచ్చయ్య.
సెక్రటరీ. ఆర్గనైజింగ్‌కమిటీ. పల్లెకోన.

* * *

### ఉండి బోర్డుహైస్కూలు విద్యార్థుల కడగండ్లు

స్థానిక విద్యార్థి సంఘం రాష్ట్రసంఘ ఆఫీసుకు పంపిన రిపోర్టులోని కొన్ని విషయాలు.

ప్రధానోపాధ్యాయుడు 17-3-39 తేదీన స్కూలులో విద్యార్థులు సభ జరుపుకొనుట కనుమతినిచ్చి సభ జరుగుచుండగా అధ్యక్షుని అనుమతి లేనిదే హఠాత్తుగా సభలోకివచ్చి విద్యార్థి సంఘ ప్రధానకార్యదర్శి మూర్తిరాజు. సూర్యనారాయణరాజు, నాగభూషణం, శరభయ్య మున్నగు వుపన్యాసకులను అవమానపరచిరి, విద్యార్థులు సభను జరిపిరని గడచిన 11 మాసములలో జరిగిన యింగ్లీషు పద్యము లన్నియు ఒక్కపర్యాయమునకే వప్పచెప్పవలయునని హుకుంచేసిరి మరునాడు 5-4-39 తేదీన బుధవారమునాడు నాల్గవఫారము (ఏ) సెక్షనులో తప్పులు పచ్చినను రాకపోయినను యిరువది మందిని బాలురని ఒకరికి ఆరుదెబ్బల చొప్పున కొట్టి, ఆక్లాసులోనే చదువుచున్న తన కుమారుడు తప్పులతో వప్పజెప్పినప్పటికి కొట్టలేదు.

ఈ ప్రధానోపాధ్యాయులుగారే గత నవంబరు మాసములో జిల్లాబోర్డు మెంబరుగానైన నంబూరి సోమరాజుగారు గెలుపొంది నప్పుడు మిట్టమధ్యాహ్నము పండ్రెండు గంటలవేళ విద్యార్థులను వెంటబెట్టుకొని ఆరోజంతయు ఊరేగిరి వీరే 2-4-39 పాలకొల్లులో జరిగిన జిల్లా విద్యార్థి మహాసభలో విద్యార్థి సంఘాలు బలపరుస్తూ మాట్లాడిరి. కాని 3-4-39 తేదీన ఉండి విద్యార్థి సంఘ అయిదవ సమావేశమునకు వుపన్యాసకులైన మాగంటి రాఘవేంద్రరావు బి. ఏ. మునిపల్లె రామారావు బి. ఏ. యల్. యల్. బి. గార్లతో వూరేగింపుతో వెళ్ళుచుండగా ఈ ప్రధానోపాధ్యాయులుగారే డా॥ గణపతిగారి వైద్యశాల యెదుట నుండి వూరేగింపును ఆడ్డపరచి సభలు జరుపుటకు వీలులేదని ఆహ్వానింపబడిన నాయకు లిరువురిని అవమానపరిచిరి. కాని విద్యార్థులు జడియకుండా వూరేగింపుతో సభ నలంకరించి జయప్రదముగా జరిపిరి.

విద్యార్థులలో వ్యక్తమౌతున్న నూతన చైతన్యం అర్థం చేసుకుని దానికి దోహదం యివ్వవలసిన ఉపాధ్యాయులే అరికట్ట ప్రయత్నించడం చాల శోచనీయం. ఉండి విద్యార్థి సంఘం యెంతటి సక్రమమైన రీతిలో నడుస్తూవుందో వారి కరపత్రాలే తెల్పుతాయి. పాఠాలు రాలేదని మిషపెట్టి బాలురను పేముబెత్తముతో కొట్టుట గర్హనీయమైన విషయం. సంఘంలో జరుగుచున్న మార్పులను గ్రహించి యికనైనా ఉండి ప్రధానోపాధ్యాయులు తమ ప్రాత పోకడలను కట్టిపెట్టి విద్యార్థుల సక్రమమైన కోర్కెలను నెరవేర్చెదరని యాశించుచున్నాను. ఉండి విద్యార్థి సోదరులు వారి ప్రధానోపాధ్యాయుల బెదరింపులకు జడియక న్యాయమైన తమ హక్కులను సంపాదించుకొనవలెనని హెచ్చరించుచున్నాను.

జి. రామకోటేశ్వరరావు,
ప్రధాన కార్యదర్శి
ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘం.

* * *

తే॥ 12-4-39 ది సాయంత్రం యిందుపూరు గ్రామ ద్వితీయ రైతు మహాసభ, నూకలపాటి వెంకారెడ్డిగారి అధ్యక్షతను సమావేశమై యీక్రింది తీర్మానములు చేసినది.

వచ్చేసంవత్సరమునకు అధ్యక్షులుగా నూకలపాటి వెంకారెడ్డిగారినిన్నీ, ఉపాధ్యక్షులుగా బస్వారెడ్డి బైరాగిరెడ్డిగారినిన్నీ, కార్యదర్శిగా నూకలపాటి శంకరయ్యగారినిన్నీ, కార్యనిర్వాహక మెంబర్లగా (1) యేలూరు పోలారెడ్డి (2) యరబోలు రామచంద్రారెడ్డిగార్లను యేకగ్రీవముగా నెన్నుకొనడ మైనది.

గ్రామోద్యోగస్థులు హోల్‌టైం వర్కర్లు కానందున రాజకీయ సంఘములలో పైవారిని పాల్గొనగూడదని చెప్పడము వ్యక్తి స్వాతంత్ర్యానికి భంగకరమని అభిప్రాయపడుచూ, గ్రామోద్యోగస్థులు రాజకీయ సంఘములలో పాల్గొనగూడదనే నిషేధమును తొలగించవలసినదిగా మద్రాసు మంత్రివర్గమును కోరిరి.

గ్రామంలో కూలీలకు జీతమిచ్చు కొలత పాత్రలును, అమ్మకముయొక్క కొలత పాత్రలునూ, మక్తాలు కొలుచుకొను కొలత పాత్రలునూ, సరిగా పెట్టించి రూల్సుకు వ్యతిరేకముగా నడచు వారిపై చర్య తీసికొనుటకు యీక్రింది వారిని కమిటీగా నియమించడమైనది.

1. నూకలపాటి వెంకారెడ్డి 2. యరబోలు రామచంద్రారెడ్డి 3. యేటూరు సుబ్బరామిరెడ్డి



# ఆంధ్ర కార్మిక సంఘాలు

## నెల్లిమర్లలో సమావేశమయి చేసిన తీర్మానాలు

కాన్పూరు, అహమ్మదాబాదు, కాళీపట్నం, మధుర, కోయంబత్తూరు, మద్రాసు, కాకినాడలలో సమ్మెదారులమీద లాఠీచార్జి చేయుట, 107, 144 సెక్షనులను జారీచేయుట, క్రిమినలు లా అమెండుమెంటు చట్టమును ప్రయోగించుట, అరెస్టులుచేసి, శిక్షలుచేయుట మరియు చీరాల, చిట్టివలసలలో కార్మికులపై కాల్పులు చేయుటను ఈ సభవారు ఐక్యకంఠముగా ఖండించుచున్నారు.

### కమ్యూనిస్టు పార్టీ

కమ్యూనిస్టుపార్టీపై ఆంక్ష ఉండుట సాధారణ పౌరసత్వపు హక్కులను నిరాకరించుట గాన ఇండియా కమ్యూనిస్టుపార్టీ మీద ఆంక్ష తొలగించుటకు వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రివర్గాలు కేంద్ర ప్రభుత్వముపై వత్తిడి తీసుకొనివచ్చి కరాచీ ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని ఆచరణలో పెట్టవలసినదని, వారిని మహాసభవారు కోరుచున్నారు.

### కార్మికుల సర్వసాధారణ హక్కులు

కార్మిక సంఘాలను యజమానులు గుర్తించుటకు, స్థిరమైన నౌకరీలకు. కనీస వేతనములను నిర్ణయించుటకు, జీతముపై నెలవుల నిచ్చుటకు, జబ్బుభీమా నెలకొల్పుటకు ముసలితనములోను, నిరుద్యోగము నందును సహాయపడుటకు కార్మిక శాసనములను తీసుకురావలసినదిగ మద్రాసు ప్రభుత్వమును యీ సభవారు కోరుచూ తీర్మానించుచున్నారు. కార్మిక ఋణవిమోచన చట్టమును చేయించవలసినదిగా కోరుచున్నారు. విద్యాభివృద్ధికి మ్యునిసిపాలిటీలు. జిల్లాబోర్డులచే పర్కర్సు క్లబ్బులను ఏర్పాటు చేయించాలి,

### రజకులు

సుమారు రెండు సంవత్సరముల క్రితమే రజకులకు చాకిరేవు చేసుకొనుటకుగాను తగు వసతులు కల్పించవలసినదిగా గెజిటెడు వుత్తరవులు చేసివున్నప్పటికిన్నీ స్థానికసంస్థల వారుగాని పురపాలం వర్గమువారుగాని వానిని ఆచరణలో పెట్టలేదు. కాంగ్రెసు ప్రభుత్వమువారిని యీవిషయములు వెంటనే తగుఅవుసర కార్యక్రమము జరుపవలసినదిగా ఆర్డర్లుజారీ చేయించవలసినదిగా ప్రార్థించుచున్నారు.

### కల్లుగీయువారు

ప్రతిపేపరు తాలూకాకు వచ్చి (కల్లుగీయువారు, చెట్టుపన్నులు కట్టవలెనని ఆజ్ఞాపించుటకదు అన్యాయంగాన వెంటనే అన్నిచోట్ల గ్రామ మున్నబులవద్ద చెట్టుపన్నులు కట్టవచ్చునని ఆర్డరు యిప్పించుటకు రివిన్యూబోర్డువారినీ సభవారు కోరుచున్నారు,

### పాకీవారు

పాకీవారికి నె 1 కి రు 12 లకు మించిన జీతము లుండుట కూడదను ప్రభుత్వ నిబంధనను రద్దుచేయుచు వెంటనే ప్రతివానికి నెలకు కనీస జీతము రు 15/-లు ఏర్పాటు చేయించ వలసినదనియు.

జిల్లాబోర్డులు మ్యునిసిపాలిటీల యందుగల కార్మిక గర్భిణీ స్త్రీలకు మద్రాసు మెటర్‌నిటీ బెనిఫిటుఆక్టు వర్తింపచేయవలసినదియు.

జబ్బుచేసినప్పుడు సిక్‌లీవున్నూ సంవత్సరమునకు 15 రోజులు క్యాజువల్‌లీవు, నెల ప్రివిలేజిలీవు. జీతముమీద విధిగా అందరి పాకీవాండ్రకు నివ్వవలెననియు,

వర్షకాలములో వర్షమునుండి కాపాడుకోట్లు, సాలుకు స్త్రీపురుషులందరకు క్రమంగా 4 కోకలు 4 రవికలు 4 చొక్కాలు 4 చెడ్డీలు ఇప్పించ వలసినదనియు.

మ్యునిసిపల్ చట్టమును మీరి 60 నుండి 120 వరకు మరుగుదొడ్లను, చెత్తబండ్లకు నిర్ణయింపబడిన యిద్దరిని తగ్గించి బండివనితోనే ఆపనినంత చేయుటను రద్దుచేయించవలసినదని తీర్మానించుచున్నారు.

### యేలూరు కూలీలు

ఏలూరునందుగల జ్యూటుమిల్లు సుమారు 2½ సం. రములనుండి మూయిబడియుండుటచే షుమారు 1000 కుటుంబములు తిండిలేక మలమలమల మాడుచున్నాయి, కాన వెంటనే మిల్లును త్రిప్పునట్లు చేయుటయో పనిలేని కూలీలకు తక్షణమే జీవనోపాధినిచ్చు యితర మార్గము చూపించవలసినదిగా మదరాసు ప్రభుత్వంవారిని ఈసభవారు కోరుచున్నారు.

### తివాసీ నేత

ఆంధ్రదేశమందు తివాసీ నేతపరిశ్రమకు ప్రసిద్ధికెక్కిన ఏలూరు తివాసీ నేతకూలీలు దుర్భరదారిద్ర్యమునకు గురియగు చున్నారు. గాన ప్రభుత్వంవారు తివాసీ నేతపరిశ్రమకు తగినరక్షణయిచ్చి కూలీల జీవనభృతి హెచ్చునట్లు ప్రయత్నించెదరని యీసభవారు కోరుచున్నారు.

### పోర్టు కూలీలు

విశాఖపట్నం పోర్టుకేంద్రప్రభుత్వ సంస్థ అయినప్పటికి అచ్చట కార్మికులకు ప్రభుత్వోద్యోగులకు మామూలుగానుండువని నిఖరము లేక పోవుట అధర్మము, సర్వీసునియమములు అభివృద్ధి శిక్షణలు తగునుచిత విధానములపై నడవలేదని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు. హార్బరు నిర్మించినప్పుడే పనిలో ప్రవేశించి యిప్పటికి 16 సం॥రంలు అనుభవముగల 8 గురు పనివార్లను పనిలో నుండి తొలగించినందుకు హార్బరు అధికారవర్గమువారి చర్యను ఖండించుచు ఆపనివార్ని వెంటనే పనిలోనికి తీసుకోవలసినదని ఈసభవారు కోరుచున్నారు.

విశాఖపట్నం హార్బరు కార్మికసంఘమును గుర్తించు విషయములో మద్రాసు గవర్నమెంటువారు తగుఒత్తిడి చేయవలసినదని కోరుచున్నారు.

### వ్యవసాయ కూలీలు

హిందూదేశములో వ్యవసాయ కూలీల సంఖ్య షుమారు పదికోట్లు. వీరందరూ దుర్భరమైన పరిస్థితులలో బొత్తిగా చాలని కూలీలతో జీవిస్తున్నారు. ఇంతవరకు వీరికి ఎట్టి సహాయముగాని చట్టముద్వారా ప్రభుత్వం చేసియుండలేదు. కాబట్టి వీరి పరిస్థితులను గురించిన్నీ వీరికి కనీసపు జీతము నిర్ణయించుట గురించిన్నీ విచారణసంఘాన్ని వెంటనే ప్రభుత్వం నియమించవలసినదిగా యీ సభవారు కోరుచున్నారు.

### జట్కాబండివాళ్లు

జట్కాబండ్లపై లైసెన్సు పన్నులు చాలా జాస్తీగా యున్నందుననున్నూ వాటిరాబడులు తగ్గుటచేతనున్నూ సదరు లైసెన్సు మొత్తం తగ్గించవలసినదిగా గవర్నమెంటువారినికోరుతూ తీర్మానించడమైనది.

### బస్సు సర్వీసులు

బస్సు సర్వీసులను జిల్లాబోర్డువారే నడుపవలయునియూ అట్టిజిల్లాబోర్డు బస్సులపై ప్రస్తుతము ఆయా సర్వీసులలో పనిచేయుచున్న కార్మికులనే నియమించవలెననియూ కోరుచు యీ సభవారు తీర్మానించుచున్నారు.

### ముద్రణాలయములు

ఫ్యాక్టరీ చట్టమును ముద్రణాలయములకు కూడా వర్తింపచేయవలసినదిగా మద్రాసు ప్రభుత్వము వారిని కోరుచు తీర్మానించడ మయినది.

### తోళ్ళ పరిశ్రమ

ఆంధ్రదేశమునందలి తోళ్ళ పరిశ్రమలోని కార్మికులు మిక్కిలి అనారోగ్యకరమయి. నటువంటి పరిస్థితులలోను తక్కువ కూలీతోను ఎక్కువ గంటలు పనిచేయుచు, నివసించుటకు కొంపలులేక జీవించు చున్నారు, మరియు, కార్మికు లెప్పుడు తమకు ఋణపడి యుండేటట్టి విధానము అవలంబించుటచే ఆట్టి ఋణకారణముచే ఎట్టి దుర్భర పరిస్థితులలోనైననూ పని చేయవలసిన వారు అగుచున్నారు. కాన, యీ పరిస్థితులగురించి విచారించుటకే అనధికార విచారణసంఘమును నియమించ వలసినదిగా మద్రాసు ప్రభుత్వంవారిని ఈ సభవారు కోరుచున్నారు.

### ధాన్యం. వేరుశెనగ ఫ్యాక్టరీలు

ధాన్యం, వేరుశెనగకాయల మిల్లులు మొదలయినవాటిలో యజమానులు ఫ్యాక్టరీ చట్టమును సరిగా అమలుపరచక ఎక్కువ గంటల పని కార్మికులచే చేయించుటను, వారికి విరామతపు విశ్రాంతిని యివ్వక పోవుటను ప్రమాదములు జరిగినప్పుడు నష్టపరిహారము సరిగా యివ్వకపోవుటను ఈసభవారు గర్హించుచు యీ అక్రమములు జరుగకుండా కనిపెట్టుటకు ఎక్కువమంది ఫ్యాక్టరీ యినస్పెక్టర్లను మద్రాసు ప్రభుత్వము నియమించ దలచినందులకు వారి నభినందించుచూ వెంటనే ఎక్కువమందిని ఏర్పరచవలయుననియు వారు ఫ్యాక్టరీ పనివారల సంఘముతో సంప్రదించ వలయునని కూడా నియమించ వలెనని కోరుచు తీర్మానించడ మయినది.

### రైల్వే కూలీలు

రైల్వే కార్మికులకు జీతములలో కొత్త స్కేలును ఏర్పరచియు రిట్రెంచిమెంటును చేయుటను ఇంకా మాననందులకును, చాలా కాలంనుండి పనిచేయుచున్న కార్మికులైనను వారు తగియున్నప్పుడు కూడా జీతములను హెచ్చు చేయుటకు నిరాకరించుటయు తగినంతమంది కార్మికులను నియమించక యున్న వారిచే ఎక్కువ పని చేయించుటయు, రిట్రెంచ్ చేయబడిన కార్మికులను తిరిగి పనిలో వేయకుండుటయు మొదలుగాగల రైల్వే అధికారుల విధానములను ఈ సభవారు నిరసించుచున్నారు. మరియు ప్రభుత్వంవారు ప్రత్యేకముగా స్వతంత్రమైన ఫెడరల్ రైల్వేబోర్డులను నియమించుట ప్రస్తుతము కేంద్రశాసనసభకు, రైల్వేలపై నున్న కొద్దిపాటి అధికారమును కూడా తొలగించడం జరుగుచున్నదిగాన యీ సభవారు ఫెడరల్ రైల్వేబోర్డు నియామకమును ప్రతిఘటించుచున్నారు. మరియు రైల్వేలపయి పూర్తి అధికారము ప్రజా ప్రభుత్వాధీనములో నుండనంతకాలము కార్మికుల పరిస్థితులు చక్కబడుటగాని ప్రయాణీకుల సౌకర్యములు హెచ్చుటగాని జరగదనియు, కావున రైల్వే కార్మికులు కొత్తగా ఏర్పడపోవుచున్న ఫెడరలు రైల్వే అథారిటీ నియామకమును ప్రతిఘటించవలయుననియు వీరి ప్రయత్నములకు భారతీయులందరు తోడ్పడవలసినదనియు కోరుచు తీర్మానించు చున్నారు.

### కార్మిక సంఘటన సంస్థ.

ఆంధ్ర రాష్ట్రములోని కార్మిక సంఘములు అన్నిటి సహకారము ఏర్పరచుటకు మరియు ఒక ఏకైక సంయుక్త సంస్థను ఏర్పరచుటకు ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహాసభ ఈ క్రింది తాత్కాలిక కమిటీని నియమించుచున్నది. యీకమిటీ కనీసము నెలకొకసారి కలుసుకుంటూ ప్రతి కార్మికసంఘమును సంప్రదించుచూ పనిచేసి మరల డిసెంబరులోగా రెండవ కార్మిక మహాసభ ఏర్పాటు చేయవలసినదిగా యీ సభవారు నిశ్చయించుచున్నారు.

### కమిటీ సభ్యులు

పి. వెంకటరావు, అధ్యక్షులు.
వి. వి. నరసింహం, యం. యల్. ఏ
కే. సుబ్బారావు,
ఉపాధ్యక్షులు.
కే యల్. నరశింహం, ప్రధాన శక్రటరీ.
పి. వెంకటేశ్వర్లు, సహాయ కార్యదర్శి,
సి. వి. కే. రావు, పి. వి. శివయ్య.
ఆర్ వెంకటప్పయ్య.
డి. మాణిక్యాలరావు, జె. సత్యనారాయణ, ఆర్. ఆదిశేషయ్య. కోడి నరశింహం, ఆర్. శ్రీరామమూర్తి. సి. పర్సు రామానాయుడు, జి. వెంకటరాయుడు, సభ్యులు.

ఈ కమిటీకి యితరులను కోఆప్టు చేసికొనుటకు అధికారము యివ్వడమైనది.

# యుద్ధభయాన్ని కలిగించే హిట్లరు ముస్సోలినీలకు రూజ్‌విల్టు సందేశం

### ఆల్బేనియా పతనము : యుద్ధసన్నాహాలు

ఇటలీ ఆల్బేనియాను మ్రింగింది. అప్పటి నుండి బాల్కాను రాజ్యాలపై దాడి వెడలడానికి చక్కని అవకాశము సంపాదించుకొన్నది. జర్మనీ ఇటలీలు బాల్కాను రాష్ట్రాలపై దండయాత్రలు సాగిస్తారని అందరూ ఊహించసాగారు. పోలండు తన యుద్ధసన్నాహాలను మానుకొనక సాగించింది. హాలండు తన హద్దులను కాపాడుకోడానికి క్రొత్త సైనిక దళాలను పంపింది. ఏసమయానికి ఎట్టి ఉపద్రవము వచ్చినా ఎదుర్కోడానికి ఫ్రాంసు ఏర్పాట్లు చేసింది. ఇంగ్లండు మధ్యధరా సముద్రములోని మాల్టా నావికాశ్రయాన్ని మరింత బలపర్చింది. మధ్యధరాసముద్రమందలి బ్రిటిషు యుద్ధనౌకలను, గ్రీసుకు చెందిన కార్ఫూను రక్షించడానికి పంపినదని వార్తలు: బ్రిటిషు ప్రభుత్వము అత్యవసరంగా పార్లమెంటును సమావేశపరచింది. ఇటలీకి మరియే యితర దేశముపై దండెత్తాలనే ఉద్దేశమే లేకపోతే, అల్బేనియాకు వేలకొలది సైన్యమును ఎందుకు పంపాలనే సందేహము ఫ్రెంచి పత్రికలు వెల్లడించాయి.

అన్నిదేశాలు యుద్ధానికి తయారు కావడం చూచి ముస్సోలినీ (ఇటలీ నియంత) కండ్లు తెరచాడు. తనకు గ్రీసుదేశముపై దండెత్తాలనే ఉద్దేశమే లేదన్నాడు. అంతేగాక గ్రీసుదేశము యొక్క భూభాగాన్ని తాను గ్యారంటీ చేస్తానన్నాడు.

### బల్గేరియా నాటకము

బల్గేరియా రుమేనియా నుండి డొబ్రుజాలో కనీసము కొంతభాగమైనా ఇమ్మని కోరింది. గ్రీసుకు చెందిన థ్రేస్ రాష్ట్రముగుండా ఏజియను సముద్రమువరకు దారినిమ్మంది. ఇవన్నీ ఇచ్చినా, బాల్కాను ఎంటెంటీ (గ్రీసు, టర్కీ, రుమేనియా, యుగోస్లోవియాల)తో కలువనన్నది. కాని బాల్కాను ఎంటెంటీ ఆంగ్లో-ఫ్రెంచి సఖ్యతను మాని తటస్థవిధానాన్ని అవలంబిస్తే అప్పుడు చేరుతానని చెప్పింది. అంటే బల్గేరియా, జర్మనీ ఇటలీలు తన్ను ఆడమన్న నాటకాన్ని ఆడుటను ఆరంభించింది.

### ఫ్రెంచి, బ్రిటిషు ప్రభుత్వాల వైఖరి.

ఈ పరిస్థితులలో ఫ్రెంచి ప్రభుత్వము, బ్రిటిషు ప్రభుత్వము కలసియే మధ్యధరా సముద్రములో నౌకా సైన్యాన్ని, తదితర యుద్ధసన్నాహాలను చేయసాగింది. వీటికి ప్రతీకారంగా ఉత్తరాఫ్రికాలో స్పానిషు మొరాకోకు సరిహద్దున ఫ్రెంచి మొరాకో వద్ద సేనలు ముస్సోలినీ హిట్లరు ఆజ్ఞల మేరకు ఫ్రాంకో ప్రోగుచేయసాగాడు. ఫ్రాంసు దక్షిణ సరిహద్దుకు స్పెయినులోని సంతన్దర్‌కు మధ్యకూడా సేనలను చేకూర్చ సాగాడు.

అయినా బ్రిటిషు ప్రభుత్వము రష్యాతోటి సంప్రదింపులను త్వరలో జయప్రదముగా పూర్తిచేయడానికి ఆతురత ఏమీ చూపలేదు. ఇదిచూచే లేబరు (కార్మిక పార్టీ) పత్రికలు, లిబరలు పత్రికలుకూడ రష్యా సహకారమును పొందుటకు బ్రిటిషు ప్రభుత్వము అట్టె ఇష్టము కనబరచుట లేదని వ్రాశాయి. ఛాంబర్లేను రష్యాతో సహకారము పొందటానికి ఎక్కువ ప్రయత్నించకపోవడమేగాక, జనరల్ ఫ్రాంకో వద్దకు బ్రిటిషు రాయబారిని పంపి, స్పెయినుతో బ్రిటను ఎప్పుడూ సానుభూతి కలిగి ఉంటుందని తెలియజేశాడు. ఒక వైపు జిబ్రాల్టరు చుట్టూ ఫ్రాంకో సేనలు మూగుతూ ఉంటే, ఫ్రాంకోకు మరియొకప్రక్క బ్రిటిషు రాయబారి సానుభూతి చూపుతూ ఉండడము ఛాంబర్లేను ఫాసిస్టు నియంతల ఆక్రమణల నాపడానికి నిజంగా ప్రయత్నిస్తున్నాడనుకోడాని వీలు లేకుండా ఉంది.

నవశక్తి
నేటిప్రపంచం

ఈ లోపల పోలండు తాను సూచించిన షరతులను ఆలోచించి జవాబు తెలియజేయమని కొంతకాలము వ్యవధిని జర్మనీ ఇచ్చినట్లు తెలుస్తూ ఉంది.

అల్బేనియాలో కాన్స్టిట్యూయంటు అస్సెంబ్లీ అను పేరుతో కొందరు అల్బేనియా రాజు మకుటమును ఇటలీరాజుకు సమర్పించారు.

### ఛాంబర్లేను హామీ యిస్తాడు.

పార్లమెంటు సమావేశమయింది. ఛాంబర్లేను ఒక ప్రకటన గావించాడు. "ఇటలీ సైన్యం ఆల్బేనియాలోకి వెళ్ళడము, అల్బేనియా స్వాతంత్ర్యాన్ని కాపాడడముగాని, దాని భూభాగము నెవరూ తీసుకొనకుండుటగాని కాజాలదు. అల్బేనియాను ఆక్రమించడముతో ఇటలీ ఊరుకోలేదు. కార్ఫూ దీవిని కూడ ఆక్రమించుకోవాలని చూచింది. కాని అట్టిపని జరిగితే బ్రిటిషు ప్రభుత్వము చాల తీవ్ర చర్య తీసుకోవలసి వస్తుందని తెలియజేసిందన్నాడు, అడ్రియాటిక్ మహాసముద్రము, మధ్యధరాసముద్రములో ఒక భాగమే. అల్బేనియాను ఆక్రమించడమువలన అడ్రియాటిక్‌లో పూర్వపు స్థితి లేకుండాపోయింది. అంటే మధ్యధరా సముద్రములో ఎట్టి మార్పులు తీసుకురామని ఇటలీ ఇంగ్లండులు చేసుకొన్న ఒడంబడికకు ఇది వ్యతిరేకము. అయినా ఆ ఒడంబడికను రద్దుపరచడానికి బ్రిటనుపూనుకోదు. ఎందుకంటే ప్రస్తుత విషమ పరిస్థితులలో అట్టిపని ఏమిచేసినా చాల ప్రమాదము కలుగుతుంది.

"కాని గ్రీసు యొక్కగాని, రుమేనియా యొక్కగాని స్వాతంత్ర్యానికి స్పష్టంగా ముప్పు కలిగిగే పని నెవరైనా చేస్తే, దానిని ఎదుర్కోడానికి గ్రీసు, రుమేనియా ప్రభుత్వాలు తమ జాతీయ శక్తులతో పూనుకుంటే, వెంటనే గ్రీసు రుమేనియా దేశములకు బ్రిటిషు ప్రభుత్వము పూర్తిగా సహాయము చేస్తుంది.

"రష్యాను కూడ మాతో కలుపుకోడానికి ప్రయత్నిస్తున్నాము. ఈ విషయములో మేము ఇతర దేశాల అభిప్రాయమును కూడ గమనించవలసి యుండుటచే మేము కోరునంత శీఘ్రంగా పనులు జరుగడము లేదు." దలదీరు కూడ ఫ్రెంచి ప్రభుత్వము తరపున ఈలాంటి ప్రకటన మరియొకటి చేశాడు.

ఛాంబర్లేను ఉపన్యాసము, మితవాద కార్మిక నాయకుడగు అట్లీకి కూడ నచ్చలేదు. డిక్టేటరుల మాటల నమ్మి ఆంగ్లో ఇటాలియను ఒడంబడికను ఇంకను అమలు నందుంచటాన్ని నిరసించాడు.

ఛాంబర్లేనుయొక్క ఈ ఉపన్యాసానికి జవాబుగ కాబోలు హిట్లరు స్పెయిను తీరమున జర్మనీ నౌకా వ్యూహములను అలవాటు చేసుకోడానికి ప్రారంభింప జేశాడు. గ్రీసు స్వాతంత్ర్యాన్ని ఇటలీ గ్యారంటీ చేసినపుడు, రుమేనియాతో జర్మనీకి వర్తకపు టొడంబడిక యున్నప్పుడు, గ్రీసు రుమేనియాలకు ఇటలీ జర్మనీల నుంచి ఎట్టి ఉపద్రవము కలిగి యుండేదికాదు, బ్రిటిషు ప్రభుత్వము గ్రీసు రుమేనియాలకు ఇట్టి హామీ ఇవ్వడము వింతగా నున్నదని జర్మనీ పత్రికలు వ్రాశాయి. ఇటలీ పత్రికలు బ్రిటను తానిచ్చిన వాగ్దానాలను ఆచరణలో పెట్టజాలదని సందేహాన్ని వెల్లిబుచ్చాయి.

గ్రీసు, రుమేనియాలు ఛాంబర్లేను ప్రకటనకు తమ సంతోషాన్ని తెలియజేశాయి. అయితే ఈ క్రొత్త బాధ్యత లేమీ మీద పడలేదని పోలండు ప్రకటించింది. హిట్లరు ముస్సోలినీల దాడిని అరికట్టాలంటే, గ్రీసు, రుమేనియా, పోలండులు ఒకరికొకరు సహాయము చేసుకోడానికి తయారు కావాలి. రష్యాకూడా ఈ దేశాలకు పూర్తిగా సైన్య సహాయము చేయడానికి ముందుకు రావాలి. అప్పుడే ఈదాడులను ఆపగలమని బ్రిటిషు పత్రికలన్నీ వ్రాస్తున్నాయి. ఈ సూచనలను పోలండుగాని, రుమేనియాగాని అంగీకరించడము లేదు కాని రష్యా నుండి ఆయుధాలు, యుద్ధసామగ్రి మాత్రము కావాలట: రష్యా విమానాలు సాయము చేయవచ్చునట: కాని రష్యను కాల్బలము వస్తే, తమ దేశాలలో విప్లవాలు వస్తాయేమోనన్న భయముతో వద్దంటున్నాయి. కాని రష్యను సైన్యము లేకపోతే పోలండు, రుమేనియాలను సంరక్షించడము అసాధ్యము. వానికి సాయము ఇంగ్లండు, ఫ్రాన్సులు పంపు లోపలనే నియంతల చేతుల్లోకి పోతాయి. ఈ గొడవంతా చూస్తున్న రష్యాకు ఛాంబర్లేను ప్రయత్నాల యందు విశ్వాసము కలుగుట లేదన్న ఆశ్చర్యమేముంటుంది?

### యుద్ధ భయము.

యుద్ధము వస్తుందనే భయము ఎక్కువగుతూవుంది. జపాను నౌకలపై ఇన్సూర్ చేసేవారు అదే రీతి బొంబాయి, న్యూయార్కులలో కూడ యుద్ధము వస్తుందని ఇన్స్యూరెన్సు రేట్లు ఎక్కువ చేశారు.

నార్వే ఆత్మ రక్షణార్థము 10 లక్షల పౌనులను వినియోగించడానికి నిశ్చయించుకుంది.

బ్రిటను జిబ్రాల్టరునుండి స్పెయినుకు పోవు మార్గమును మూసివేసింది. జిబ్రాల్టరు హార్బరు ముఖద్వారాన ఇతరఓడలు లోనికి ప్రవేశించకుండ అడ్డంకులు వేయబడ్డాయి. ఈజిప్టులోను, కెన్యా, హాంకాంగులలో తగు సన్నాహాలు ఆరంభించింది.

ఇటలీ టర్కీతీరాన ఉన్న డొడెకనీస్ దీవులలోకి సైన్యాన్ని, ఆయుధాలను విరివిగా నంపిస్తూ ఉంది. దీనితోను, టర్కీలోకూడ యుద్ధమునకు తగిన సన్నాహాలు చేసుకో నారంభించింది.

జపాను బ్రిటిషు ప్రభుత్వముపైనా, చాంగ్-కే-షేకు ప్రభుత్వాన్ని బలపరుస్తూ ఉన్న ఇతర ప్రభుత్వాలపైన ఒత్తిడి తేవడానికి నిర్ణయించుకుంది.

జర్మనీ పత్రికలు పోలండులో జర్మనీ దేశస్థులను బాధలు పెట్టుతున్నారని ప్రచారము ఆరంభించింది.

ఇటలీ, జర్మనీ, స్పెయిను, జపానులుకలసి త్వరలో యుద్ధము ఆరంభించబోతూ ఉన్నవని రూఢివార్తలు వచ్చుటచే అమెరికా అధ్యక్షుడు రూజ్‌విల్టు అమెరికా నౌకా సైన్యాన్ని పసిఫిక్ మహాసముద్రములోకి వెంటనే వెళ్ళమని ఆజ్ఞాపించాడు. ఇలా చేయనిదే జపాను నౌకాసైన్యానికి సరితూగే సైన్యము పసిఫిక్ మహాసముద్రములో ఉండదు.

### రూజ్‌వెల్టు ప్రకటన.

రూజ్‌విల్టు బ్రిటను ఫ్రాంసులు మరింత దృఢంగా హిట్లరు ముస్సోలినీలకు వ్యతిరేకముగా నిలబడునట్లు చేయడానికి ఒక ప్రకటన గావించాడు: "ఒకదేశాన్ని మరియొక దేశము జయించాలనుకోవడం హాస్యాస్పదమే కాకుండా గొప్ప నేరముకూడ అవుతుంది. అమెరికా, శాంతిని మాబలాన్నంతా వినియోగించి కాపాడుతాము, సైన్యాన్ని సైన్యముతోనే ఢీకొంటాము, ఆర్థిక ఒత్తిడి కలుగజేస్తే, అమెరికాలోని ఏదేశానికైనా మేము పూర్తిగా ఆర్థిక సహాయము చేస్తాము అది తన స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక సౌభాగ్యాన్ని వదులుకోవలసిన అవసరముండదు.



"జర్మనీ ఇటలీలు, తమ్ము ఇతర దేశాలు చుట్టూ ముట్టడివేయడానికి ప్రయత్నిస్తున్నాయని చాటుచున్నవి. ఒకదేశము శాంతిని కోరేదయితే కొన్ని దేశాల స్వాతంత్ర్యము కాపాడుతామని మరికొన్ని దేశాలు వాగ్దానము చేసినంత మాత్రాన, ఆ శాంతినికోరే దేశమును ముట్టడించడము కాజాలదు.

"నేడు ప్రపంచమందు ఆర్థిక జీవితమంత అవినాభావ సంబంధము కలిగి ఉంది. ప్రపంచములో ఎచ్చట దానికి అంతరాయము కల్గినా, మిగిలిన స్థలముల అన్నిటిలోనూ ఆర్థిక జీవనము తారుమారు అవుతుంది. అందుచేతనే ప్రపంచ వ్యవహారాలలో మాకు జోక్యముంది.

"తమ ధ్యేయాలను పొందడానికి వివిధ దేశాలు, వేయి సంవత్సరాలకు ముందు మధ్యయుగములో హూణులు, వాండాలులు అవలంబించిన మారణ విధానమునకన్న శ్రేష్ఠతమగు విధానముల నవలంబించలేమా?

"నేడు మనలను ఎదుర్కొంటూ ఉన్న సమస్య, మన నాగరికత అంతులేని యుద్ధ వాతావరణములోకి ఈడ్వబడ వలసిందేనా? ఈ వాతావరణములో అప్పుడప్పుడు యుద్ధములు వస్తూ ఉండవలసినదేనా? శాంతిని, నాగరికతయొక్క వ్యక్తిత్వమును, మా ప్రాణములో ప్రాణమైపోయిన ఈ ఆదర్శాలను మన మవలంబించలేమా?"

### అమెరికా వైఖరికి కారణము.

అమెరికా ఇంత శ్రద్ధ తీసుకపోవడానికి కారణము లేకపోలేదు. జర్మనీ అవలంబించే బార్టరు పద్ధతి (సరకులకు బదులు సరకుల నిచ్చి ఒక దేశముతో మరియొకదేశము వర్తకము చేయుట) వలన, అమెరికా వర్తక వ్యాపారమునకు దెబ్బ తగులుతుంది. అంటే జర్మనీతో బార్టరు పద్ధతి ననుసరించి వర్తకం చేసే దేశాలతో అమెరికా వర్తకము లేకుండా పోతుంది. దీనివలన అమెరికా ఆర్థిక జీవనముతో ఈమార్పులు వచ్చితీరుతాయి.

1. విదేశాలనుండి ఎట్టివస్తువులను రానివ్వకుండ, తమకు కావలసిన వస్తువులను మాత్రం తామే తయారు చేసుకొను పద్ధతి నవలంబించుట. దీనిమూలమున, అమెరికాలో పెట్టుబడిదారీ సమాజమయినందున, జాతీయ ఆదాయము పడిపోతుంది. ప్రతి ఒక వ్యక్తి ఆదాయము పడిపోతుంది.

2. లేదా విదేశ వ్యాపారమును పెంపొందించడానికి ఎగుమతులకు ఎక్కువ సహాయము (సబ్సిడీలు) చేయవలసి ఉంటుంది. దీనివలన పన్నులు ఎక్కువ చేయాలసి ఉంటుంది. ఆరూపంగానైనా జాతీయాదాయము తగ్గిపోతుంది.

3. లేదా కార్మికులచే ఎక్కువ గంటలు పని చేయించడము, తక్కువ జీతాలివ్వడము చేయాలసి ఉంటుంది. ఈరకంగాచేస్తే అప్పుడు అమెరికను పెట్టుబడిదారులు విదేశాలతో పోటీ చేయగలరు.

అందుచే జర్మనీ మిలటరీ బలముతో దేశాలను జయించి, వానితో బార్టరు పద్ధతి అవలంబించి, ఇతర దేశాల సామగ్రిని వానిలోకి రానివ్వనందున, అమెరికా జర్మనీ యొక్క మిలటరీ యాత్రలను ఇంత తీవ్రంగా ఎదుర్కొంటూ ఉంది. ఏమైనా అమెరికా ఫాసిస్టు, నాజీ నియంతల నరికట్టడానికి పూనుకుంటూ ఉంది.

### రూజ్‌విల్టు సందేశము.

అమెరికా అధ్యక్షుడు ఆ ప్రకటనతోనే ఊరుకోలేదు. మరుసటి రోజు హిట్లరు ముస్సోలినీలకు ఈ క్రింది సందేశాన్నంపాడు. "కనీసం పది సంవత్సరాలవరకు చేయగలిగితే 25 సంవత్సరాలవరకు ఇప్పుడు స్వతంత్రంగా ఉన్న దేశాలపై దండెత్తమని హామీ యిచ్చినచో ఆ హామీ ఆదేశాలను రూజ్‌వెల్టు తెలియజేసి అట్టి హామీనే ఆ దేశాలనుండి జర్మనీ, ఇటలీలకు ఇప్పిస్తానన్నాడు. ఈ విధంగా ప్రపంచమందలి దేశాలన్నీ హామీలిచ్చిన పిదప, ఇవి అన్నీకలసి ఒక సమావేశము జరుపాలనీ అందు అమెరికా కూడ పాల్గొంటుందనీ ప్రకటించాడు. కాని వీనికి ముందు కొన్ని విషయాలు గమనించాలి. యూరపులో మూడు దేశాలు, ఆఫ్రికాలో ఒకదేశము, దూర ప్రాచ్యమున చైనాలో చాల భాగాన్ని ఫాసిస్టులు ఆక్రమించుకొని ఉన్నారు. అంతేగాక వచ్చే రిపోర్టులనుబట్టి చూస్తే ఇంకను ఇతర స్వతంత్రదేశాలకుకూడ ఆక్రమించుకొనునట్లు తెలియజేయుచున్నది. ఈలాగే మరి కొంతకాలము సాగితే తప్పక యుద్ధము సంభవిస్తుంది.

రూజ్‌విల్టుయొక్క ఈ సందేశమునకు హిట్లరు, ముస్సోలినీలు జవాబు ఇంకనూ చెప్పలేదు. కాని జర్మనీ పత్రికలు రూజ్‌విల్టును దూషింపసాగాయి, ఇంగ్లండు, ఫ్రాంసులు రూజ్‌విల్టు సందేశాన్ని బలపరుస్తూ ప్రకటించాయి.

సోవియటు యూనియను అధ్యక్షుడు కాలినిన్ రూజ్‌విల్టును అభినందిస్తూ ప్రపంచశాంతిని నెలకొల్పడానికి, రక్షించడానికి తయారుగ ఉన్న సోవియటు ప్రజలు వీరి సందేశాన్ని పూర్తిగా బలపరుస్తున్నారని తెలియజేశాడు. సోవియటు యూనియను అట్టి వివిధదేశాల సమావేశంలో పాల్గొనడానికి తనసంసిద్ధతనుకూడ తెలియజేసింది. హిట్లరు, ముస్సోలినీలు? .... ....

# కాకినాడ సమ్మె విశేషాలు

(మా విలేఖరి)

10–4–39 వ తేదీని మద్రాసునుంచి లేబర్ కమీషనర్‌గారు వచ్చారు. సమ్మెదార్ల తరపున కామ్రేడ్ సి. వి. కె. రావుగారు, కొరపాటి పట్టాభిరామయ్యగారు వెళ్లారు. వర్తకుల తరపున కూడా ఇద్దరు ప్రతినిధులు హాజరు అయారు. నరసింహదేవర సత్యనారాయణగారు, పళ్ళంరాజుగారు, జిల్లాకలెక్టరు కూడా ఉన్నారు. పీచు కూలీలకు వర్తకులిస్తూన్న కూలి రేట్లను గురించి ఎకౌంటు బుక్కులు పరిశీలించారు లేబర్ కమీషనర్ గారు. రోజుకు సగటున 0–2–0 కంటె ఎక్కువ ఇవ్వడములేదని సమ్మెదార్ల ప్రతినిధులు రుజువుచేస్తే, వర్తకులు 0–12–0 వరకూ యిస్తున్నాం అని బుకాయించారు. కాని, ఎన్ని ఎకౌంటు బుక్కులు చూచినా, 0–6–0 కంటె ఎక్కువకూలి ఇచ్చిన వర్తకుడే లేడు! 0–8–0 అని వర్తకులు చెప్పిన సగటు రేటు కూడా కంచుకాగడా వేసి చూచినా కనపడలేదు! వర్తకుల బుకాయింపు లేబర్ కమీషనర్ ఎదుట బట్టబయలైంది. లేబరు కమీషనర్ ఖర్చులు తక్కువగా ఉండే పల్లెటూళ్లలో సహితం కూలీ 1కి 0-4-0, 0-5-0 యిస్తూంటే కాకినాడపట్టణములో పనిచేసే పీచుకూలీలకు 0–2–0 కంటె రోజువారీ రేటు ఎక్కువ ఉండాలని తమ నిశ్చితాభిప్రాయాన్ని తెలియచేశారు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని గురించి వర్తకులు దుమ్మెత్తిపోస్తోంటే, సోషలిస్టుల యెడ సహనభావము వహించాలని లేబర్ కమీషనర్ బోధించాడు. జరిగిపోయిన ఘటనలను మరచి, భావి కర్తవ్యము ఏమో ఆలోచించవలసియున్నదని ఆయనే చెప్పాడు. రేటు ఎంతవరకు హెచ్చించగలరని వర్తకుల్ని ప్రశ్నించారు. మొదట సమ్మెదార్లందరూ పనిలోకి వెళ్ళితేనే తరువాత ఆలోచిస్తామని వారు జవాబిచ్చారు. దానితో లేబర్ కమీషనర్ వళ్ళు మండింది. శాంతికి భంగం కలిగించేవారు వర్తకులే కాబట్టి వారిమీద చర్య గైకొనవలసిన అవసరాన్ని జిల్లా కలెక్టరు సమక్షంలోనే సూచించారు.

కాని సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు అనాటి సాయంకాలమే వర్తకులమీద ప్రయోగింపవలసిన 144 వ సెక్షన్ సమ్మెదార్లమీద, వారి నాయకులమీద ప్రయోగించాడు. 5 గురు కంటె ఎక్కువమంది సమ్మెదార్లు ఒకచోట సమావేశం కాకూడదని నోటీసులో ఉంది. సోషలిస్టు పార్టీ సభ్యులందరికీ ఈ నోటీసు వర్తించేటట్లు ఉంది. ఆంధ్రదేశములో కాంగ్రెసు సోషలిస్టు పార్టీపై జనరలు నిషేధాజ్ఞ అమలుజరపడము ఇదే ప్రథమము.

కూలీసంఘ సభ్యులు ఆనాటి రాత్రి కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఆఫీసులో సమావేశమై, మరునాడు 144 వ సెక్షన్‌ని లక్ష్యపెట్టక, పికెటింగు చేయడానికి నిశ్చయించుకున్నారు. 11-4-39 వ తేదీ ఉదయము ఆయిదేసి మంది, అంతకంటె ఎక్కువమంది సమ్మెదార్లు పికెటింగు, ఊరేగింపు ప్రారంభించారు. సాయంత్రంలోగా 8 జట్లుల్ని పోలీసులు ఎరస్టు చేశారు. వీరిలో సుమారు 25 మంది స్త్రీ కార్మికులు కూడా ఉన్నారు. మొత్తము 45 మంది. కాని, సాయంత్రం అయేసరికి అందరినీ విడిచిపెట్టివేశారు. పార్టీ సభ్యులైన కామ్రేడ్స్ రావు వెంకట జగ్గారావు, నండూరి శ్రీనివాసరావు, ఆర్. సత్యనారాయణ, గద్దం మహాలక్ష్మి, మరి ఇద్దరు కార్మికుల్ని మాత్రము విడిచిపెట్టక కేసులు బనాయించారు. 1173 వ నెంబరు పోలీసు కానిస్టేబిలు ఒకరిని చెంపమీద కొట్టి,లాఠీతో పొడిచాడు.ఎంత నిర్బంధ విధానం అమలు జరుపుతున్నా సమ్మెదార్ల ఉత్సాహం తగ్గలేదు. "ఆకలి బాధ నశించాలి!" "కూలి హెచ్చాలి!" "144 వ సెక్షన్ రద్దుకావాలి!" మొదలైన నినాదాలతో పికెటింగు, ఊరేగింపు సాగించారు. స్త్రీ సమ్మెదార్ల ఉత్సాహానికి హద్దే లేదు.

12 వ తేదీ వచ్చింది. సమ్మెదార్లు ద్విగుణీకృతోత్సాహంతో పికెటింగు సాగించారు. 50 మంది బాలబాలికలు చిన్న చిన్న ఎర్రజండాలతో "ఎగరాలి ఎగరాలి మనఎర్రజండా!" అని పాటలు పాడుకొంటూ ఊరేగింపుగా బయల్దేరేరు. మెయిన్ బజారులో వారందర్నీ పోలీసులు ఎరస్టుచేసి, లారీలో స్టేషన్‌కు తీసుకు వచ్చారు. ఒకగంట స్టేషన్‌లో ఉంచి, విడిచిపెట్టారు. తరువాత స్త్రీ కార్మికులు 8 జట్లుగా బయల్దేరి పికెటింగు చేశారు. సాయంత్రం వరకూ వారిని పోలీసుస్టేషన్‌లో ఉంచారు. వీరిని నోటికిరాని బండబూతులుతిట్టి అవమానపరిచారు. అయినప్పటికీ, విడుదలకాగానే మళ్ళీ జట్లు జట్లుగా వెళ్ళి పికెటింగు చేసేవారు. ఉత్సాహం అంతకంతకు హెచ్చుతోంది. పార్టీసభ్యులైన కామ్రేడ్ సి. హెచ్. చిన్ననుతప్ప మిగిలిన వారందర్నీ విడుదల చేసారు. పార్టీ సభ్యుల్ని విడుదల చేయకపోతే, సమ్మె అంతరిస్తుందని పోలీసుల నమ్మకం కాబోలు! కాని, సమ్మెమాత్రం ఆగిపోలేదు సమ్మెదార్లే స్వయంగా, పార్టీసభ్యులు లేకుండానే, పికెటింగు ప్రారంభించారు.

12 వ తేదీ సాయంకాలం కళా వెంకట్రావుగారు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఆఫీసుకు వచ్చారు. "వర్తకులమీదకూడా కలెక్టరు 144 జారీచేస్తే, రేపటినుంచి మీసత్యాగ్రహం విరమిస్తారా?" అని ఆయన ప్రశ్నించారు. ఆయన వెళ్ళిన ఒకగంటకే వర్తకులమీద 144 జారీ చేయబడింది.

రాజీ సంభాషణలకు ఆనాటిరాత్రి 7 గంటలకు కామ్రేడ్ సి. వి. కె. రావుగారి యింటికి తిరిగి కళా వెంకట్రావుగారు వచ్చారు. వీరు కూలి రేట్లను గురించి మర్నాడు ఉదయం వర్తకులతో మాట్లాడి తెలియజేస్తాననీ, సత్యాగ్రహాన్ని మాత్రం మర్నాడు ఆపుచేయవలసిందనీ కోరారు. ఇంతకుముందే సంఘం 5 గురు చొప్పున పికెటింగు సాగించవద్దని తీర్మానించింది.

ఆవిధంగానే మరునాడు (13-4-39) సమ్మెదార్లు 5 గురితో పికెటింగు చేయలేదు. కామ్రేడ్ రావుగారికి వెంకట్రావుగారు ఉదయం కబురు పంపిస్తే, రావుగారు కాంగ్రెస్ కమిటీ ఆఫీసుకి వెళ్ళారు. వర్తకులు హండ్రడ్ వెయిట్ 1కి 0-1-0 చొప్పున రేటు హెచ్చించడానికి అంగీక రించినట్లు వెంకట్రావుగారు, యితర నాయకులు తెలియ జేశారు. 0-2-0 ల చొప్పున హెచ్చిస్తేగాని సమ్మెదార్లు పనికి వెళ్ళరని రావుగారు జవాబుచెప్పి తిరిగి వచ్చేశారు.

మధ్యాహ్నం ఆఫీసుకి నరసింహ దేవర సత్యనారాయణగారు విచ్చేశారు. చిన్నవర్తకులు చిన్న రేట్లు పెద్దవర్తకులు పెద్దరేట్లు, యివ్వడం న్యాయం అని ఆయన వాదించ బోయారు. కాని, మరునాడు, అందరు వర్తకలూ ఒకేరేట్లు యివ్వడానికి పీచువర్తకులే అంగీకరించారు! రంగయ్య నాయుడుగారు కూడా కామ్రేడ్ పట్టాభి రామయ్యగారి యెదుట యీ వాదనే చేశారు. ఇంతేకాదు, లేబర్ కమీషనర్ తన అభిప్రాయాన్ని తొందరపడి యిచ్చాడు. కాబట్టి ఆయన సలహాను మన్నించ నవసరంలేదంటూ కూడా రంగయ్య నాయుడుగారన్నారు.

13-4-39 వ తేదీ రాత్రి పార్టీకార్యాలయానికి మళ్ళీ కళా వెంకట్రావుగారు,మండపాకవారు వచ్చి, వర్తకులు 0-1-0 చొప్పున హెచ్చించిన కూలి రేటు అంగీకరించవలసిందని మళ్ళీ కోరారు. అంగీకరిస్తే, సోషలిస్టు పార్టీకి బలము హెచ్చుతుందని చెప్పారు. అంగీకరించకపోతే, సమ్మెదార్లు తిండిలేక ఓడిపోవలసివస్తుందన్నారు. ఈరేటుకంటె ఏ ఆర్బిట్రేషన్‌బోర్డు ఎక్కువ సిఫార్సు చేయదని అభిప్రాయమిచ్చారు. కాని, సమ్మెదారులు 0-2-0 ల హెచ్చింపుకి మాత్రమే అంగీకస్తారనీ, లేబర్ కమీషనర్ ఇదివరకే రేట్లను పరిశీలించియున్నాడు కాబట్టి ఆయన చైర్‌మన్‌గా ఉన్న ఆర్బిట్రేషన్ బోర్డు ఏరేటు నిర్ణయిస్తే ఆరేటు తీసుకోవడానికి కూలీలు అంగీకరిస్తారనీ, కామ్రేడ్ రావుగారు జవాబు చెప్పారు. ఈవిధముగా కూలీల సంఘములో ప్యాసైన తీర్మానాన్ని యెరుకపరిచారు.

అసలువిషయం ఏమంటే, ఇదివరకే ఈ 0-2-0 ల హెచ్చింపుకి కొంతమంది వర్తకులు తమ ఆమోదాన్ని తెలియజేశారు. 2 సంవత్సరాలకు పూర్వము యింకా ఎక్కువ రేట్లు ఉండేవి. ఆరేట్లే యిప్పుడుకూడా ఇవ్వవలసిందని సమ్మెదార్లు మొట్టమొదట్లో కోరినప్పటికీ, నేడు 0-2-0 హెచ్చింపుకి దిగారు. కాకినాడవంటి పట్నములో కూలీకి 0-6-0 చొప్పున రోజువారీ రేటు ఉండడము సబబు అని ఉప్పుమాల్ కూలీల సమ్మె సందర్భములో లేబర్ కమీషనర్ నిర్ణయించినప్పుడు, పీచుకూలీలకు కూడా ఆరేటు ప్రకారము హండ్రడ్‌వెయిట్ 1కి 0-2-0 చొప్పున హెచ్చించాలి.

ఈరెండు రోజుల్లోనూ (13-4-39, 14-4-39) పీచువర్తకులు 144 వ సెక్షన్‌ను ఏవిధంగా మన్నించారో చూదాం. ఆ ఉత్తరువు ప్రకారం ఏవర్తకుడూ 2 నెలల వరకు బయటి కూలీలను నియమించకూడదు. తాను, తన కుటుంబం, తన "యింటి నౌకర్లు" చేయు పనికి మాత్రం ఉత్తరువు వర్తించదు. కాని, యించుమించు అన్ని షాపులలోను దొంగ కూలీలు స్వేచ్ఛగా పనిచేస్తూనే ఉన్నారు. వాళ్ళు నెల జీతగాళ్ళని వర్తకులు బుకాయిస్తూ పోలీసులకు స్టేట్‌మెంట్లు యిచ్చారు. నిజంగా వాళ్ళు నెల జీతగాళ్లే అయినప్పటికీ, పీచు షాపుల్లో పనిచేయడానికి వీల్లేదు. కూలీ సంఘం తరపున యిట్టికేసుల్ని ఎన్ని రిపోర్టుచేసినా పోలీసులు చర్య తీసుకోలేదు. పైగా, కూలీలచేత పని చేయించుకున్నారు.

14-4-39 వ తేదీ సాయంకాలము పీచు వర్తకుల మీద 144 సెక్షన్ రద్దుచేస్తూ ఉత్తరువు ఇచ్చాడు కలెక్టరు. కారణము, కూలి రేటు 0-1-0 చొప్పున మాత్రం హెచ్చించడానికి అంగీకరించారట! కాని మొదటి రేట్లనుంచి సమ్మెదారులు క్రిందికి దిగినప్పటికి వారి మీద మాత్రం 144 అలాగే ఉంది! వర్తకులమీద ప్రయోగించిన 144 రెండురోజులు మాత్రమే ఉంది. ఆ రెండు రోజులయినా కాగితము మీదనే ఉంది. అచరణలో లేదు. కూలీలు 144 ధిక్కరిస్తే, 2 నిమిషాల్లో ఎరస్టులు; వర్తకులు 144 ధిక్కరిస్తే 2 రోజుల్లో రద్దు! పెట్టుబడిదారీసమాజములో ఉండే వైపరీత్యాలంటే ఇవే!

సమ్మెదార్లు సమ్మెను పొడిగిస్తే యేప్రదేశాలనుంచి తాటినార యిక్కడికి వస్తోందో ఆప్రదేశాలలోనే తాము కూలీలను పెట్టి పనిచేయించుకుంటాం అని వర్తకులు ప్రచారము సాగిస్తున్నారు. ఈవిధముగా చెపితే సమ్మె ఆజిగిపోతుందని వారి అభిప్రాయము. అట్టి పద్ధతి ఏవిధముగానూ వర్తకులకు లాభదాయకము కాదు.

సమ్మెదార్లు 15-4-39 వ తేదీని తిరిగి 144 లక్ష్యపెట్టకుండా పికెటింగు ప్రారంభించారు. దొంగకూలీలు పనిచేస్తున్న షాపులవద్దకు జట్లు జట్లుగా వెళ్ళి పికెటింగు చేశారు. సుమారు 150 మందిని పోలీసులు ఎరస్టుచేసి, 12 మందిని తప్ప మిగిలినవారందరినీ సాయంత్రము అయేసరికి విడిచిపెట్టేశారు. ఆ 12 మందీ సమ్మెలో ఇతరులకంటె ఎక్కువ చురుకుగా పనిచేస్తున్న నాయకులు, నాయకురాండ్రు. వారందరి మీద పోలీసులు కేసులు పెట్టారు. వీరిని విడిచిపెట్టకపోయినా, 16 వ తేదీని మళ్ళీ జట్లు జట్లుగా పికెటింగు జరిగింది. పాత నాయకులను ఎరస్టుచేసి కేసులు పెడుతూంటే, కొత్త నాయకులు తయారవుతున్నారు. 16 వ తేదీ మధ్యాహ్నమునుంచి ముగ్గురు ముగ్గురు మాత్రమే సమ్మెదారులు షాపులవద్ద పికెటింగు చేస్తున్నారు.

# త్వరలో విడుదలగానున్నది!

రామగోపాల్ పిక్చర్సువారి సినిమా కళాసృష్టి!

## "పాశుపతాస్త్రము"




—*నటులు*—

★ నిడుముక్కల

★ రఘురామయ్య

★ సూరిబాబు

★ చంద్రమౌళి

★ పూర్ణచంద్రరావు

★ లక్ష్మయ్య

★ శ్రీమతి అన్నపూర్ణ

★ శకుంతల

డైరెక్టరు:
ట. యస్. మణి

స్టూడియో:
ఆంధ్రసినీటోను

సాంకేతిక ప్రవీణులు:

ఛాయాగ్రహణం:
దేవ్జీ

శబ్దగ్రహణం:
ముఖర్జీ

కవి:
కాళిదాసు

సంగీతము:
గోపాల్ సింగ్

డిస్ట్రిబ్యూటర్లు:—
సరస్వతీ టాకీస్ లిమిటెడ్, బెజవాడ.

గ్రామఫోను ప్రపంచమందలి మధురగానము 'పాశుపతాస్త్రము' రికార్డులు:—
సన్ రికార్డు కంపెనీ వారివి.

Published by M. Chandrasekhara Rao
Printed by Tummala Venkata Ramiah } at Navasakti Press, Governorpet, Bezwada.

